# కిషోరి

గ్రంథకర్త:

**సూరి పార్థసారధిశర్మగారు**

ప్రకటనకర్త:

**సంపర మల్లిఖార్జునరావు**

నవ్యా బుక్ డిపో, బెజవాడ.

మొదటికూర్పు 1000 ప్రతులు.

బెజవాడ:

ఆంధ్రవాణీ ముద్రాక్షరశాలయందు

ముద్రింపబడినది.

1940





వెల రు 1—

# వినతి.

నా రచనలో ఇది ప్రథమ పొత్తమైనా, కారణాంతరాలచేత నా "రంగూన్ మెయిల్" తొలుత ప్రచురింపబడ్డది. దాని హక్కులు కురుగూరి సుబ్బారావు అండ్ సన్ వారికి విక్రయించాను. ఈ కిషోరి పుస్తకం కూడా గ్రాంధిక భాషలోనే వ్రాశాను. కాని ఇటీవల నా మిత్రులు కొంతమంది ప్రోత్సహించడంచేత గ్రామ్యభాషలోకి మార్చవలసి వచ్చింది. ముద్రణకు జాగవడానికి ఇదికూడా ఒక కారణమే. కథా వస్తువులో ప్రేమకు ప్రాధాన్యం ఈయబడ్డది. ఆ ప్రేమకు అనేక ఆటంకాలు కలిగి, హత్యలుజరిగి, రహస్యాపరాధపరిశోధకుని చాకచక్యంచేత సుఖాంతమై జ్యోతి వెలిగింది. సాంఘిక నాటకాలు యిప్పటికెన్నో వెలువడ్డవి కాని, పరిశోధక నాటకం యెక్కడా వున్నట్లు కనపడదు. అందువల్ల ప్రపంచానికి నూతన దృశ్యం చూపించాలనే అభిలాషతో ఈ పుస్తకం వ్రాయడానికి సాహసించాను. కాని నాసాహసం యెంతవరకు ఫలించిందో, నాఉద్యమంలో యెంతవరకు కృతకృత్యుడనయ్యానో నిర్ణయించే భారం ప్రపంచానికి విడిచి పెట్టాను. ఈ నాటకంలో కొన్ని రంగాలలో హంతకుల సంభాషణలోనూ, హంతకుల యింట్లో జరిగిన పరిశోధకుల శృంగార ఘట్టాలలోనూ, ద్వంద్వార్థంగా చిత్రించానని నా అభిప్రాయం. ఈ నాటకంలో అనవసరంగా సృష్టించిన పాత్ర ఒకటికూడా లేదని నా నమ్మకం. ప్రతిపాత్రకూ కూడా తగిన ప్రాధాన్యం యిచ్చాను. లోపాలు సహజం. తెలియజేస్తే కృతజ్ఞుణ్ణి.

ఇట్లు,

సూరి పార్థసారధి శర్మ.

# PREFACE.

This drama Kishori is a novelty in Telugu drama. It is unsurpassingly intricate in plot, instructive in character and graphic in technique. The Author moulded his characters from the Modern society, breathed life and light into them, and handed it down to us and the posterity. It is out and out realistic in nature and this true-to-life reflection of Kishori may bring this full-fledged offspring of the young Author's muse perpetuity. The sentiments in the drama are sublime, the thoughts polished, the prose colloquial and natural and the poetry sweet and lyrical. The impressions created by the scenes are deep and lasting. The catastrophe is well wrought and the nemesis is brought about wonderfully. The retribution is just and natural and the conclusion is super and fine.

The villain of the plot who is made of sterner-stuff is a consummate demi-devil and belongs to the Machiavellian type. The typical life of a professional whore is depicted in the character of Bansari who with her sinster insinuations infused courage and strength into Kathore and got the old-hag, Iswerlal–a simple ton—murdered by him in cold blood to get at his wealth. Kishori is the pivot on which the drama rotates. She is an accomplished girl with all feminine graces and played her part to the admiration of all. She is independent,

sagacious and wise, who could unravel the wicked plots of Kathore and Bansari with the assistance of Gangu and Ramachandar. She brought to light that Mohandas was above all suspection. Her matrimonial union with Mohan is an illustration of what constitutes an ideal marriage. Ramachandar is a speciman of a good-natured man and his theory on matrimony is far sublime. His bereavement for Madhura-Bala wrings our tears of pity and he gives her a place among the stars in the Celestial World. Madhura Bala is the flower of woman kind. The honest Mohan gives himself up to despair on account of the scandals set afloat against him by Kathore and his incarceration finally brought mental derangement on him. Saroja the most fascinating girl advocates widow marriage, does immense propaganda and eventually fulfills her noble mission, herself setting an example. She is united in marriage with Chandran an young inspector of police and they mutually loved each other intensely. Saroja's role as Gangu is simply excellent. The court scene reveals the mystery of the whole drama and completes the purgation of the souls of the audience. This new drama with high sentiments is let into this modern world to find favour with the public. Let the reader give its due.

MUNAGALAPALLE,
25 -7—1940.

(Sd.) N. C. Vedi,
(*B. A., Lit*).

# రెండే మాటలు.

ఆంధ్ర నాటకరంగం అధోగతి పాలయి తలెత్తడానికి అవకాశం లేక పోవడం ప్రేక్షక జనాన్ని ఆనందపరచి, నటకులనటనాశక్తిని వ్యక్తపరిచే ప్రవీన నాటకాలన్ని వ్రాసేకవులు కరవైపోవడమే ముఖ్యకారణం. మరి రెండు మూడు కారణాలువున్నా ప్రస్తుతం వాటి నిక్కడ తడవడం అనవసరం. ఈ కిసోర నాటకాన్ని చదివిన తరువాత నాటక ప్రపంచంలో కొత్తపోకడల్ని కల్పించి నటకుల కుతూహలాన్ని అధికంచేసి అట్టి దారిద్ర్యాన్ని రూపుమాపాలన్న దృఢసంకల్పంతో యీ కవిగారు యిట్టి వ్రాతలను ప్రారంభిస్తున్నారా అన్న సందేహం కలుగుతోంది. అదే నిజమయితే యీ బాల కవిని ఆంధ్రనాటక లోకం ఆహ్వానించి, అభినందించి, మరికొన్ని యీ మాదిరి రసవంతమయిన రచనలను ప్రజలకు తీసుకువస్తే అప్పుడే నటులు తమ నటనాశక్తిని లోకంలో వెదజల్లి పేరుప్రఖ్యాతులార్జించి ప్రేక్షక సమూహముయొక్క మన్ననలను పొందగలుగుతారు. ఆనాడే ఆంధ్రనాటక రమణి అనుపమాన విలాసంతో ఆంధ్ర రంగోద్యాన వనంలో వుయ్యాల లూగుతూ విశ్వవిహారం చేయగలుగుతుంది. అదిమొదలు ఆంధ్రనాటక కళ చిందు లాడుతూ ప్రాచీన మానస ఫలకాలపై ప్రతిబింబించ గలుగుతుంది. అంత నుంచే విను గొప్ప పేరు నందుకొని మాలో దాగి వున్న నాటక రంగోద్ధారకులు తిరిగా జాగ్రత్తమానంగా నాటక రంగాలలో అమర కీర్తిని వెలిగింప గలుగుతారు.

ఈ నాటకాన్ని కవిని కవిత్వాన్ని పోల్చి గురించి అనవసరంగా అసందర్భ నాట్యభారతం వ్రాసేకన్న ముఖ్య మూడుముక్కలలో తేలుస్తాను.

1. కథ కల్పితమయినా సహజంగా చిత్రించబడ్డది.
2. పాత్రపోషణ అద్వితీయం.
3. రంగనిర్మాణం తూచి హెచ్చుతగ్గులు లేకుండా వుండవలసిన తీరుగావుంది.
4. భాషాప్రయోగం కాలానుసరించి వాడడం గమనింపదగ్గ ముఖ్య విషయము.
5 అంకవిభజన లేకుండా అన్ని రంగాలక్రింద వ్రాయడం కొత్త పంథా.

యింతవరకూ అపరాధపరిశోధక కథలను నవలల్లో చదవడమేగాని నాటకరూపంగా, స్వభావసిద్ధంగా, రంగములమీద చూచి ఆనందించడానికి నోచుకోలేదు. యిప్పుడీ నాటకం ఆ కొరత తీర్చింది. అందుకే నాటకానికీ యీ కవిగారికీ ముఖ్యంగా నటులు ప్రేక్షకులు కృతజ్ఞులై యుండాలి.

బెజవాడ,
25-7-40.

దర్భా సత్యనారాయణ,
కళాభిమాని.

# ఇందు వచ్చు పాత్రలు

1. ఈశ్వర్లాల్ — ధనికుడు 55 సంవత్సరాలవయస్సు 5, 6" పొడుగూ నెరసిన గడ్డం, బుజ్జిమీసాలు.

2. కిశోర్చంద్ — ఈశ్వర్లాలు మేనల్లుడు. 25 సంవత్సరాల వయస్సు. 6' పొడుగు. చామనచాయ ఫ్రెంచికట్టింగ్ మీసాలు.

3. మోహన్ దాస్ — 20 సంవత్సరాల వయస్సు. 5' 6" పొడుగు. పచ్చని శరీరం. కరల్డు క్రాప్పు. నూనూగు మీసాలు. గుండ్రని మొగం.

4. రాంఛందర్ — ఒకయువకుడు, 25 సంవత్సరాల వయస్సు. యెఱ్ఱని చాయ 5' 6" పొడుగు. మీసాలుండవు.

5. సబ్ ఇనస్పెక్టర్ — 25 సంవత్సరా లుంటాయి. 5' 6" పొడుగు యెఱ్ఱని చాయ కోరమీసాలు.

6. జడ్జి

7. బెంచిక్లార్కు

8. కోర్టుప్యూన్

9. కానిస్టేబిల్సు

10. పబ్లిక్ ప్రాసిక్యూటర్

11. కిషోరి — ఈశ్వర్లాలు కుమార్తె. 16 సంవత్సరాలు. తగినపొడుగు. చాలా అందంగావుంటుంది.

12. సరోజా — బాలవితంతువు. సామాన్యమైన పొడుగు. 15 సంవత్స రాల వయస్సు. అందంగావుంటుంది.

13. బన్సారి — వేశ్య. 30 సంవత్సరాల వయస్సు 6' పొడుగు. కోల మొగం.

14. మధురబాల — బన్సారి చెల్లెలు. 18 సంవత్సరాల వయస్సు. సామాన్యమైన పొడుగు. గుండ్రని మొగం. పచ్చనిరంగు.

(ముకుందు, గంగు, వేషములు, పై పాత్రల మారువేషము లవడంచేత, ప్రత్యేకంగా వ్రాయలేదు.)

# సవరణ పట్టిక.



| పుట. | పంక్తి. | తప్పు | ఒప్పు. |
|---|---|---|---|
| 2 | పద్యం రెండో పాదం | దాశ్యాలి | దాస్యాలి |
| 3 | ,, | దాశ్యంబుంటి | దాస్యంబుంటి |
| ,, | నాల్గవ పాదం | సునకము | శునకము |
| 4 | 21 | హాశ్య | హాస్య |
| 5 | 11 | (Hapiest) | (Happiest) |
| 11 | క. మొదటి పాదం | నీతులు కావ | నీతులు కాని |
| 14 | 23 | నిజమైతే | నిజమైతే |
| 13 | 5 | దీర్గాలోచను | దీర్ఘాలోచన |
| 22 | 13 | ఉపకారానాని | ఉపకారానికి |
| 24 | 2 | గౌరాన్ని | గౌరవాన్ని |
| 25 | 16 | నీ తండ్రియా | నీ తండ్రియె |
| 32 | 6 | చూస్తుంద. | చూస్తుంది) |
| 44 | 4 | నా వాక్యం | నాటి వాక్యం |
| 49 | 24 | అనసవరంగా | అనవసరంగా |
| 54 | సీసం మొదటిపాదం | వాసస్తలము | వాసస్థలము |
| ,, | గీతం రెండో పాదం | దివ్యపదము | దివ్యపథము |
| 55 | 19 | ప్రేక్ | ప్రేర్ |
| 66 | 16 | ఛేందడం | ఛేదించడం |
| 74 | గీతం మొదటిపాదం | సిరో | శిరో |
| 76 | 20 | సంభావతో | సంభావణతో |



# హెచ్చరిక.

ఈ నాటకానికి సంబంధించిన కాపీరైటు హక్కులో సగభాగము నేను పొందియున్నాను. గావున గ్రంథకర్తగారికీ నాకూ జాయింటుగా హక్కుభుక్తములు కలిగియున్న యీ నాటకాన్ని నావల్లగాని, గ్రంథకర్తగారి వల్లగాని వ్రాతమూలకమైన అనుమతి పొందకుండా ప్రదర్శింపకూడదు. టాకీ స్క్రీనింగు చేయుట, గ్రామఫోను రికార్డింగు చేయుట, భాషాంతరీకరించుట మొదలైన వ్యవహారములకు మా యిద్దరి అనుమతి పొందుట అవసరము. మా అనుమతిలేకుండా పై వ్యవహారములలో ఒకటిగాని, అన్నిగాని జరిపినను, పుస్తకములో అంతాగాని, కొంతగాని కాపీచేసినను వారు కలిగ నష్టాలకు బాధ్యులవటమే కాకుండా మేము జరిపే సివిల్ క్రిమినల్ చర్యలకు బద్ధులై యుందురని ఇందుమూలముగా హెచ్చరిస్తున్నాను.

ఇట్లు,

సంపర మల్లికార్జునరావు,

నెహ్రూ బజారు, బెజవాడ.

ఈశ్వ—(కొద్దిగా నవ్వి) కిశోర్, బాల్యచాపల్యం చేత విరివిగా ఖర్చు పెట్టడానికి జేబునిండా ధనం పొయ్యేడం లేదని అఘోరిస్తావు కాని, నా తదనంతరం ఈ ఐశ్వర్యమంతా నీ హస్తగతం చెయ్యాలనే నా అభిప్రాయం. ఉన్నదంతా ఇవ్వాళే వ్యయం చేస్తే రేపటి సంగతేమిటి చూడు!

మ॥ ధనమే గౌరవ మూలమౌ, ధనమె యా ♦ స్వాస్థ్యంబుఁ జేకూర్చు, నీ
ధనమే సౌఖ్యముగూర్చు, నోడ్డ ధనమే ♦ దాశ్యాళినిన్ జేయు, నీ
ధనమే సద్బిరుదంబులిచ్చు, ధనమే ♦ దైవంబు, ప్రాణంబునౌ,
ధనమూలంబు జగంబు, నిర్ధనునకున్ ♦ స్థానంబులే దిద్ధరన్.

కిశో—అంత లోభత్వం యెవ్వరికీ తగదు. అనుభవించలేని ఐశ్వర్య మెందుకు (Damn shame) డ్యాం షేం, నిన్న నా (Friends) ఫ్రెండ్సు కొందరు కాఫీ హోటలుకు వెళుతూంటే నేనుగృడ్లు మింటకరించుకుంటూ గుటకలు మింగుతూ వాళ్ళ ఆహ్వానం కోసం యెదురు చూడవలసివచ్చింది. అప్పుడు నా (Condition) కండీషన్ యెంత (Shameful) షేమ్‌ఫుల్ గా వుంది!

మోహన్:—ఆస్థితిలో నీవక్కడ "వాళ్లు పిలుస్తారా పిలవరా" అన్నట్లుగా నిలవక పోతే నీకంత చిన్నతనం కలగడానికి సావకాశంలేదు కదా.

కిశోర్—నాస్థితి వారెరుగరా? కన్యకాపురపు అగ్రహారీకుల్లాగా యెగతాళి, మామ పిసినిగొట్టువాడని, దమ్మిడీయైనా ఖర్చు పెట్టడని, మంచి (dresses) డ్రెస్సెస్ అయినా నాకు కుట్టించడని, ఒకటే నిమిటి వాళ్లుమట్టు నుచ్చినట్లుగా యెత్తిపొడిచారు. అప్పుడునాకు నిజంగా (Suicide) సుయిసైడ్ చేసుకుందామన్నంతరోషం కలిగింది.

మోహన్—మీ మామ విషయములో జరిగిన హాస్యప్రసంగాలకు నీకు రోష మెందుకు?

కర్నో—(Nonsense) నాన్‌సెన్స్. నీకీ యనవసర ప్రసంగా లెందుకు? నీ (Status) స్టేటస్‌కు తగినట్లుగా వుండు. (Mannerless) మానర్‌లెస్‌గా (Behave) బిహేవ్ చేయకు.

ఈశ్వ—ఓహో! గాంభీర్యమునిది ఉపసగాన్ని అప్పుతున్నదే? ఓరి బుద్ధిహీనుడా! నీయందు అనాదికిప్పుడే స్నేహవాత్సల్యముచేత నీ క్షేమంకోరి అతను చెబుతూవుంటే "యథార్థవాదీ లోకవిరోధీ" అన్నట్లతణ్ణి దూషిస్తున్నావేమిటి?

కర్నో—ఓహో! యేమి యథార్థవాది. కుసుమించగింజ కింద నల్లగా వున్న సంగతి నెరగడట.

మోహన్—ఔను, అయ్యా! ఆతను నన్ను దూషించడంలో అతని తప్పేమీ లేదు. చూడండి,

మ॥ "ధనమూలంబు జగంబు, నిర్ధనునకుం ♦ స్థానంబు లేదిర్ధరన్"
అని, మీచెప్పినయట్లు, నిర్ధనుడ, దా♦శ్యంబునిదీ మీచెంత, నెం
దును, నేనీతనిబోల, నెట్లితనిపై ♦ దోషంబులెంతుం గటా
చనునే నాకిది, యశ్వముం, సునక మే ♦ చందాన దూషింపనౌ.

కర్నోర్—(Yes perfectly right) యస్ పర్ఫెక్ట్లీ రైట్. యికనైనా నీ, నా తారతమ్యాలు గుర్తెరిగి ప్రవర్తించు.

ఈశ్వర్—ఓరి దౌర్భాగ్యుడా మోదరుడా? యేం తారతమ్యాలు గుర్తెరగాలి? అతని సద్గుణాలు నీకలవడితె బాగుపడతావు. పైగా ఆతణ్ణి దూషిస్తావేం.

కర్నోర్—ఆఁ. ఆయన సద్గుణాలకు నీవే మెచ్చుకోవాలి. ముందుంది ముసళ్ళ పండుగ.

మోహన్—నామంచిచెడ్డ లెంచడం ప్రస్తుతం అనవసరం, ప్రతిమాసం రెండు మూడు దఫాలుగా కనీసం నూరురూపాయలు తక్కువ లేకుండా తీసుకొని స్వంతఖర్చులకింద వ్యయం చేస్తానే

వున్నాను. కొంచం జాగ్రత్తగా వాడుకుంటే యిలాంటి అవమానాలకు స్థలమెందుకుంటుంది అని ?

కిషోర్—(Shut up) షటప్. నా స్వవిషయాల్లో (Interfere) ఇంటర్‌ఫియర్ కావద్దని లక్షసార్లు చెప్పాను.

ఈశ్వ—నీ కేమైనా మతిపోయిందా ! యేమిటా నోటి దురుసుతనం.

కిషోర్—నా విషయాలు తన కెందుకు మరి ?

ఈశ్వ—ఊం ! సహించినకొద్దీ పెచ్చుమీరుతోంది.

(కిషోరి చెవులకు లోలకులు, ఒక చేతికి గాజు, ఒక చేతికి రిష్టువాచి, ఒంటిపేట గొలుసు పెద్దది కొద్దిగా పైకి పిన్నులోకి లాగి వుంటుంది. గులాబిసిల్కు చీర, నీలంసిల్కు కాలర్ జాకెట్టు, బర్మాశాండల్సు తొడుగుతుంది. ప్రక్కపాపిటలో పొడుగాటి జెడ ముందుకు వేసుకుంటుంది. పూలు వేల్లాడుతూ వుంటాయి. ఆడుతూ ప్రవేశిస్తుంది.)

కిషోరి—(చూచి) యిదేమాశ్చర్యం. యెడమొగాలు పెడమొగాలు పెట్టుకున్నారు విషయమేమిటి ?

ఈశ్వ—యేముంది. వెట్టి వెంగళప్ప యెప్పుడూ డబ్బో, డబ్బో అని గోల.

కిషోరి—బావేనా ? నాన్నగారూ ! బావకో కాసి ఇయ్యరాదండి పోనీ కాఫీ తాగుతాడు.

కిషోర్—(పళ్ళు కొరుకుతూ) కిషోరీ ! నన్ను చూస్తే నీక్కూడా అంత హాస్యంగా వుందా ?

మోహ—బావగనుక హాస్యా లాడుతోంది. అదికూడా?......

కిషోర్—(Damit) డ్యామిట్. ఇప్పుడు నిన్నెవరు పల్కరించారు ?

కిషోరి—ఓహో ! మీ రాగ్రహ పరవశులై వున్న సంగతి నాకు తెలియదులేండి బావగారు ! (అని పురాణవరుసలో)

కిషోర—కిషోరీ అంతకంతకు మితిమీరి పోతున్నావు. నీ (Future-life) ఫ్యూచర్ లైఫ్ కూడా కొంచం ఆలోచించుకో !

మోహన్—ఒకవేళ ఆమె నీకు భవిష్యత్ ధర్మపత్ని అనుకో అందుకని యిప్పటినుంచే అదుపులో వుంచాలా?

శకుం—(You Idiot) యు ఇడియట్. ఇంత (Reckless) రెక్లెస్‌గా (behave) బిహేవ్ చేస్తావా? (అంటూ మోహన్‌దాసు మీదికి పోతాడు. యిద్దరూ కలేబడతారు. ఈశ్వర్గారు శకుంతలని, కిషోరి మోహన్‌దాసుని పట్టుకొని ఆపుతారు.)

ఈశ్వ—శకుంతలా, యేమిటీ దుర్నయం. ద్వంద్వయుద్ధానికికూడా తెలుకొంటున్నావే? మోహన్ నీకై నా వెనుక తగ్గకూడదా?

శకుం—మామా! నన్నిక్కడ ఆడదానికన్న గుణంగా అధముగ్గ చేశావు. మీ అందరిచేతా యీవిధంగా దూషింపబడుతూ యిక్కడ ఉండి రోదింపడంకన్న యేదేశమైనా పోతే (hapiest life lead) హాపియస్టు లైఫ్ లీడ్ చెయ్యొచ్చు (అనిపోబోతాడు.)

ఈశ్వ—(శకుంతలను పట్టుకొని) యిక్కడ నీ సౌఖ్యాని కేంలోపం కలిగిందని! నీకొచ్చినది ధనమేగా! మోహన్ యితని కిందికాలంలో అంతా ఇయ్యి. పో! తెచ్చుకో.

(శకుంతలందు, మోహన్‌దాసు లోపలకు పోతారు.)

కిషోరి—బాబా! శకుంతలందు మీద నీకింత అభిమాన మెందుకు? అడిగిందే తడవుగా అడిగినంత డబ్బు యిస్తూంటావు.

ఈశ్వ—అమ్మాయీ! యేంచెయ్యను. అంతకన్న గత్యంతరంలేదు. డబ్బు యివ్వకపోతే లేచిపోతాడు. తల్లిలేని పిల్లవాణ్ణి యింట్లోంచి వెళ్ళగొట్టాననే అప్రతిష్ట ధరించడం కష్టం.

కిషోరి—యెక్కడకు లేచిపోతాడు. మీరు బెదిరినకొద్దీ బెదిరిస్తున్నాడు. అయినా ఒకసారి యివ్వనని చెప్పండి.

ఈశ్వ—అందుకనేగా యిప్పుడింత రాద్ధాంతం జరిగింది.

మోహన్—అమ్మాయీ కొంప మునిగింది. (అంటూ పరివేసించి) ఇనప పెట్టెలో రూపాయలసంచి ఒకటి కనుపించడంలేదు.

ఈశ్వ—(తెల్లపోయి గుండెమీద చేయివైచి) సంచి రూపాయలే?

మోహన్—కొన్ని నోట్లుకూడా వుండాలి. అంతా ముప్పదివేల సంచి.

ఈశ్వ—(దిగులుపడి) ఓయి భగవంతుడా! కొంప నిలువునా మునిగిపోయింది.

కరో—మామా, (Iron safe keys) ఐరన్ సేఫ్ కీస్ ఎప్పుడున్నూ యితనిదగ్గరే వుంటాయిగదా? డబ్బెలాపోయిందీ?

ఈశ్వ— అవును. మోహన్ దాస్! (అని మోహన్ దాసువైపు చూస్తాడు)

మోహన్—నేను నిర్దోషిని.

ఈశ్వ—నీవేమీ సంగ్రహించలేదు గదా? (అని కిశోర్వైపు చూస్తాడు)

కరో—అదేమిటి, ఆధనం నేనే కైంకర్యంచేస్తే యింతసేపూ యీ దెబ్బలాటెందుకు. యిది నిస్సందేహంగా మోహన్ దాసు పనే.

కిషో—నీవే సంగ్రహించావని యెందు కనగూడదు.

కరో—అవును యెందు కనగూడదు? ఉన్నమాటంటే వున్నప్రం రచ్చిరాదట. నిరూపించే సామర్థ్యంలేంది యేవిషయంలోనూ అడుగుపెట్టగూడదు.

కిషోరి—నీవు నిరూపిస్తావా?

కరో—(Of Course) అఫ్ కోర్సు. మామా! నిన్న (Evening) యీవినింగ్ ఇతను (Dancing girl) డ్యాన్సిగ్ గరల్ దగ్గరకు వెళ్ళికొంతసేపు సరాగాలాడి డబ్బుసంచి చేతికివ్వడం నేను చూశాను.

మోహన్—అయ్యో! నేనా! యిదంతా అబద్ధం.

కిషోరి—అసత్యమే. మోహన్ దాసు గుణం అలాంటిదికాదు బాబా.

కరో—అవునవును. పాపం అసత్యం. పిల్లి కళ్ళుమూసుకొని పాలు తాగుతూ యెవరూ చూడటం లేదనుకుంటుందిట. అలాగే (Door) డోర్ (Close) క్లోజ్ చేసినంత మాత్రాన్ని యెవరూ చూడరనుకోవడం అవ్యక్తం కాదూ? (Lock hole)

లాక్ హోలులోంచి (Clear) క్లియర్‌గా చూశాను.
రాంఛందర్ (Witness) విట్నెస్.

ఈశ్వ—యిక సందేహంలేదు. (కోపం నటిస్తూ) మోహన్‌దాస్

మ॥ తెలసెన్ బో కుటిలాత్మ నీ నడత సత్వద్వర్గ పరీపించియున్
కొలువే సేయిడి ప్రోచుచుంటం గుణమున్ గోత్రాబు నీట్ముచ్చి, రో
వెలదిన్ జో, హరింతె నాధనము, పృథ్విన్ రహకున్ భకుణన్
సగుణన్ జూతువె సిగ్గుకున్ సినుగనన్ చాల్జాలు పో పో ద్రోహికన్॥

కపోత—తండ్రీ పూర్తిగా విచారించి ఇదమిత్థమని నిర్ధరించకుండా
అతన్ని దూషించడం............

ఈశ్వ—చాలు, విచారించడం అనవసరం, నాకు పూర్తిగా అనిపించింది.
"అతివినయం ధూర్తలక్షణం" యేం మోహన్‌దాస్! తక్షణం
నా యింట్లోనుంచి కదులు.

మోహన్—ఇది కేవలం అన్యాయం......

ఈశ్వ—న్యాయాన్యాయాలు నీవు మాకు బోధించక్కర్లేదు. నడు.

కమల—మామా దొంగ దొంగ అని అంగీకరిస్తాడా?

కపోత—దొంగ నువ్వు. తండ్రీ అవకాశమిస్తే మోహన్‌దాసు నిర్దోషి
అని నేను ఋజువు చేస్తాను.

ఈశ్వ—నోరుముయ్యి. చనువిచ్చినకొద్దీ నెత్తికెక్కుతున్నావు.

కమల—మామా! యెవరికు (Side) సైడ్ చెస్తోందో గ్రహించు
కున్నావా?

ఈశ్వ—యేమోయ్ వెళ్ళిపోతావా. పోవా!

మోహన్—నన్ను కనికరించరా (అని జాలిగా లిపేట్లు చూస్తాడు.)

ఈశ్వ—నీ అవసరం పో.

మోహన్—అయ్యా! ఇదిగో తాళం చెవులు (అని యిచ్చి తలవంచు
కొని పోతాడు. కపోత కన్నీరు కారుస్తూ మోహన్
దాసు వెళ్ళేకేసి చూస్తూవుంటుంది. ఈశ్వరుడు కోపదృష్టి
తోనే మోహన్ వెళ్ళేటు చూస్తూవుంటాడు. కమలుడు
మీసం మెలేస్తూ తలపంకిస్తూ వుంటాడు. తెరపడుతుంది).

———

# రెండవ రంగము



స్థలం — వేశ్యాగృహం. గోడలకు అద్దాలు పటాలు వుంటాయి. మూడు కుర్చీలు ఒకమూల ఎత్తైన స్టూలు వుంటాయి. దానిమీద అగరువత్తులు వెలిగించి వుంటాయి అత్తరు వగయిరా పరిమళ ద్రవ్యాలు వుంటాయి.

మధురబాల ఒక కుర్చీలో పుస్తకం చూచుకుంటూ వుంటుంది. తెల్లని సిల్కుచీర, తెల్లని జాకెట్టు, వాలుజడ మెడమీదనుంచి ముందుకు వేల్లాడుతూవుంటుంది. చెవులకు లోలాకు లుంటాయి మెడలో పెద్దగొలుసు వొంటిపేటది. కుడిచేతికి ఒక గాజు రెండోచేతికి గడియారం వుంటాయి.

బన్‌సారి - బనారసు చీర కట్టుకొని, రంగుజాకెట్టు తొడిగి పొడుగాటి లోలాకులు పొడుగాటి జడ. వయస్సులోవున్నదానివలె అలంకారం చేసుకొని ప్రవేశించుతుంది.

బన్‌సారి—యీాగ్రహచారమేమిటే, శరీరంమీాద యవ్వనం చిందులాడేప్పుడు, ధనార్జన చెయ్యకపోతే జీవితాంతంవరకూ జరగడమెల్లా. ముద్దొచ్చినప్పుడే చంక నెక్కాలి. వృద్ధాప్యంలో మన ముఖమెవడు చూస్తాడూ?

మధు—అక్కా, వెధవడబ్బు. ధనార్జనకోసం యీా జీవితాన్ని పాపభూయిష్టంచెయ్యాలా? ఒక రాగిడబ్బుకు యీాశరీరాన్ని అద్దెకిచ్చి, ప్రతినీచుని యుచ్ఛిష్టాన్నీ భుజించాలా? ఇంత యేహ్యంగా జీవయాత్ర గడపటం యెందుకు?

బన్‌సారి—యే వృత్తిమీాద జీవించే వాళ్ళా వృత్తిమీాదనే జీవించాలి. "కులవృత్తికి సాటిలేదు గువ్వలచన్నా" అన్నాడు. శాస్త్రకారుడు గణిక అనే పేరు మన కెందుకు పెట్టాడు?

మధుర—అందువల్ల మనకు గణించడమే వృత్తి అంటావా?

బన్‌సారి—అవును.

మధు—పొరపాటు. మన చర్యలనుబట్టి గణిక అనీ, వెలయాలి అనీ మనకు నామకరణాలుచేసి, మనల నొక ధర్మసత్రాలవలె ఉప

యోగించు కుంటున్నారు. మన అవివేకాన్ని బాగా గ్రహించి మనలను వకుస వావులులేని పశువులక్రింద గణిస్తున్నారు.

బక్ సారి—ఒకరు గణించడ మేమిటి? ధనార్జనకోసం అలా చరించక తప్పదు. "సర్వేజనాః కాంచన మాశ్రయంతే"

మధు—సరే యీ వృత్తిమీద కాక యింకోవిధంగా జీవయాత్ర గడవదూ?

బక్ సారి—యెలా గడుస్తుంది?

మధు—యింతకన్న మార్గమేలేదా? వెట్టిదానా!

చ॥ పరులకు దాశ్యముఁ సలిపి ♦ బత్తెము గ్గొన కుక్షినిండదే?
తిరిపెమునెత్తి యీ క్షుధను ♦ దీర్చుకొనఁ జనదే మనోహరుఁ
పరిణయమైనచో పతియె ♦ భాగ్యముకాదె, ధనంబికేల, నీ
పరమ నికృష్ట జీవనము ♦ భావ్యమె యెవ్వరికైన సోదరీ.

బక్ సారి—స్వేచ్ఛాజీవనం చెయ్యడం నికృష్టమా? సేవకావృత్తి, భిక్షాటన గౌరవదాయకాలా? బాగున్నది.

మధు—మనది స్వేచ్ఛాజీవనం యెలా ఔతుంది. సేవకావృత్తికన్న కూడా నీచాతినీచమైన వృత్తి. సేవకుడికి ఒక్కడే యజమాని. మనకో భూమిమీదవున్న ప్రతి జీవీ యజమానే. కరణాలు వెట్టివాళ్ళమీద చూపే అధికారం, వెట్టివాడుకూడా మన మీద చూపుతాడు.

బక్ సారి—ధనానికి మాత్రమే మనమీద సర్వాధికారం వున్నది. కోటీశ్వరుడైనా మనం ఆశ్రయమియ్యంది మనయింటికి రాగలడా?

మధు—చౌర్యంచేసి జీవించేవాళ్ళు కూడా వొస్తారు. త్రాగుబోతులుకూడా వొస్తారు. కాళ్ళాచేతులా తన్నుతారు. నోట్లో యెంగిలి పెడతారు. జుట్టుపట్టి యీడుస్తారు. నానా భీభత్సు చేస్తారు. అధికారం లేకుండా యిలా యెవరైనా చెయ్య గలరా? వాళ్ళిచ్చే స్వల్పమూల్యంతోటి యీ శరీరంమీద వాళ్ళకు సర్వాధికారాలు కలుగుతున్నాయి. మనం యీ

యిల్లు బాడుగకు తీసుకుని యీ యింట్లో స్వేచ్ఛగా విహ రించడం లేదూ !

బర్ సారి—నువ్వు యెన్ని చెప్పినా ధనంకోసం యేపనిచేసినా తప్పు లేదని శాస్త్రకారుడు వ్రాశాడు, కష్టపడంది ఫలం యెలా దక్కుతుంది ?

మధు—ఈవిధంగా ఆర్జించి ఔన్నత్యం వహించిందెవరు?

బర్ సారి—మన పూర్వులకీ పుక్కిట పురాణాలు తెలియకనే కాబోలు కన్నెరకం కులాచారంగా యేర్పరచింది.

మధు—తెలియకకాదు, కన్నెరకం పెట్టడం ఆచారమే. కన్నెరి కం పెట్టినవాడే కాంతుడనినమ్మి యిహసౌఖ్యా లనుభవించ మన్నారు కాని యిలా ప్రతివాళ్ళతలకు మసిపూయమని చెప్పలేదు.

బర్ సారి—కన్నెరికంపెట్టిన ఒక్కడితోటే కాపురంచెయ్యమనడానికి అదేం వివాహమా. కులవృత్తికి దారిచూపడానికి కన్నెరిక మనేది యేర్పడ్డది.

మధు—కన్నెరికమనేది వివాహమే. సూత్రబంధన, ఔపోసనం ఆనాడే ముగుస్తున్నాయి. కన్నెరిక ధర్మాలు విడిచిపెట్టి, ధన పిశాచంపట్టి యీదుర్వృత్తికి పాల్పడుతున్నారు.

బర్ సారి—యింతకూ యెన్ని చెప్పినా నామాటలు నీబుఱ్ఱకెక్కవు.

మధు—నాబుఱ్ఱకెక్కకపోవటమేకాదు. నీకు గూడా చెపుతున్నాను అక్కా.

మ॥ చనదీ దుర్వ్యవసాయ మెవ్వరికినిన్ ♦ సత్కీర్తికిన్ దూరమౌ,
బెనవైచున్ కలుషంబు, లన్యసతులున్ ♦ వేనోళ్ళదూషింతు, రం
గన దుర్వ్యాధులపాలుగావలయు న♦క్కా మానుమీవృత్తి, నీ
మనమందొక్కనిగోరి పెండ్లియగుమా ♦ మర్యాద కాపాడుమా !

బర్ సారి—ఆహా ! యేమి శ్రీరంగనీతులే. యీనీతులన్నీ స్వవిషయా లలో ఉపయోగించవనుకుంటా ?

మధు—తా ననుసరించని నీతి యింకొకరికి బోధించడం దోషమే.

బక్సారి—అదే నేననడంకూడా!

చ॥ పరులకు చెప్పవచ్చు బహుభంగుల నీతులుకావ, చేతలో
నరుదగు, వారిసెపండితులు ♦ నాడిటు నీతుల నంతెకాని తా
మరచిరె దుష్టచెష్టములు ♦ మానిరె దుర్వ్యసనాలు వృద్ధులుగా
పరుగిడు వేశ్యవాటికకు ♦ పల్కుచునీతుల నెన్నొయూరిలోగా.

మధు—అలా సంచరించే వాళ్లు విశ్వాసఘాతకులనడంలో సందేహం లేదు. అలాంటి కాపురుషులుండడం చేతనే ప్రపంచ మింతటి అధోగతిపాలు కావడానికికారణం. అక్కా! అందువల్లనే నేనింత పాత్రకులాడడం. మనతప్పు దిద్దుకొని యితరుల నధిక్షేపించడం బాగుంటుంది.

బక్సారి—తనతప్పు తాను తెలుసుకోవడం చాలాకష్టం. రాంచందర్ని నీవువివాహం చేసుకున్నావా?

మధు—ఓహో ఇదియా నీయనుమానము. వివాహమంటే బహిరంగంగా బాజాభజంత్రీలతో జరిగిందేనా పెండ్లి? గాంధర్వవివాహంకూడా గౌరవింపతగ్గదే. ఒకరినొకరు అన్యోన్యంగా ప్రేమించుకుని సన్మార్గంగా సంచరిస్తేచాలు. ప్రేమలేంది పెండ్లిమాత్రమెందుకు.

బక్సారి—నువ్వాతణ్ణి గాఢంగా ప్రేమించావన్నమాట. అతనిధనాన్ని ప్రేమించలేదు?

మధు—అక్కా! యేందుకీ కుతర్కం.

మ॥ ధనముగా దెమ్మని యెన్నడైన నతనిగా ♦ దండించినానో నగల్
గొనితేలేదని కోపగించితినో నా ♦ కీ వస్త్రముల్ లేవునా
మనమందించుక యుల్కపొందితినొ యే ♦ మాటాడ్మాటవాకొంటినో
వనితా యాతడె నావిభుండు పరదై ♦ వంబంచు పూజింపనో.

బక్సారి—మహాపతివ్రతవు గనుక.....

మధు—ఎత్తిపొడవనక్కర్లేదు. నా సత్ప్రవర్తన నేను చెప్పుకోవడం తప్పే.

(అంతట కఠోర్‌చంద్ పూర్వపువేషంతోనూ, రామచందర్ తెల్లటి వెడల్పాటి నల్లంచుపంచ బిళ్ళగోచీతో కట్టి, సిల్కులాల్చి వేసుకొని, పైని సిల్కుకండువా వొయ్యారంగా వేలాడుతూ కాళ్ళకు కాబూలీశాండల్సు వేసుకొని ప్రవేశించుతారు )

బన్‌సారి—యిక యెప్పుడూ అనను.

కఠో—అక్కాచెల్లెళ్ళల్లేవో (Arguments) ఆర్గ్యుమెంట్సులో కొట్టుకుపోతున్నారు?

బన్‌సారి—అనవసర ప్రసంగాల కిక్కడ అవకాశం లేదు.

కఠో—అడుగులోనే పిడుగా.

(బన్‌సారి పెడ మొగం పెట్టుకొని కూచుంటుంది)

రాంఛం—మధురా! మన మవతలకు తొలగడం మంచిది.

మధు—(అని యిద్దరూ కొంతదూరం నడచి) యీ చాటున నిలచి తమాషా చూదాం. (అని యిర్వురూ చాటున నిలుచుంటారు)

కఠో—అదంతా కోపమే.

బన్‌సారి—అస లిప్పుడు నీ రాకకు కారణం.

కఠో—(wonder) వండర్. నేనిక్కడి కెందు కొస్తానో నీకు తెలీదూ?

ఉ॥ నీ నగుమోము సొరుగన ♦ నీ బిగికౌగిట హాయిజెంద, నీ
యానన తేనెలాన, నవ♦యవ్వన భాసురగాత్రి నీకృపన్
దీనతగోరి సౌఖ్యముల♦దేలగ నే నరుదెంచియుంట, నీ
కేనుడువంగనేల హరి♦ణేక్షణ నీవ యెరింగియుండగన్!

బన్‌సారి— ఆహా! శృంగారరసం వొలికిపోతున్నదే. నీయిష్టమొచ్చినట్లాడటానికి తేరగా యెవరూలేరు.

కఠో—నీవు తప్ప.

బన్‌సారి—నాకేం పెట్టి పోషిస్తున్నావా?

కఠో—నేను కాక యింకెవరు పోషిస్తున్నారు ?

బక్‌సారి—అక్కేపేర్లికు.

ఉ॥ యెన్నడో కొన్ని రూప్యముల ♦ నిచ్చితివో సరిపోయె, నింకనీ
వెన్నిదినాలునర్ గదియ♦ నెంతువు రూకలనీక, తేరగా
నున్నది యన్న ధైర్యమున ♦ నుండగ బోల్లను మింకచాలు నీ
మన్నన, నిన్ను బోల్విటులు ♦ మాకిక గల్గగబోరు పృథ్విలోన్.

కఠో—బక్‌సారీ, యింతనిర్దయ యెవ్వరికీతగదు. చూడు !

ఉ॥ కయ్యములాడ నేల బ్రియ ♦ కాంత ! ధనంబును తెచ్చినీకు నే
నియ్యనె యెన్నిమార్లో! యిక ♦ నియ్యకయుందునె ముందు,నాకు నీ
నెయ్యమె సర్వసౌఖ్యముల ♦ నిక్కముగా నిదునంచు, కోరినే
నియ్యెడ కేగుదెంచ నిపు♦డీగతి బల్కుటనీకు ధర్మమే.

బక్‌సారి— బియ్యపుగింజలకైనా చాలకుండా యెన్నిసార్లిస్తేనేమి యిచ్చానన్న పేరేకాని !

కఠో—యింతే ? మరి యీవస్త్రాలు, యీ అలంకారాలు ?

బక్—ఆ ! నువ్విచ్చే ముచ్చి మూడురూకలతోటే.

కఠో—యివ్వాలో రేపో తప్పకుండా నీవు కోరినంత ధన మిస్తాను. సరేనా !

బక్‌సారి—కోరినంత యెక్కడ తెచ్చిస్తావు ?

ఉ॥ పెంచిన ప్రేమజేసి, విల♦పింపగజేయక నంతో యింతో వె
చ్చించగనిచ్చు మామ, తమ ♦ చెయ్దు లెరింగిన నీయబోడు, యా
జ్రించగ నీకుగా దెటుల♦ చెందును రొక్కము నాకు, నిట్టులన్
వంచనజేయజూచెదవె ♦ వట్టి బిభీషలు పల్కు యంధుడా.

(కఠోర్చందు ఆలోచిస్తూ వుంటాడు)

మధు—ప్రియా, యింతవరకూ చెంత కూర్చుండటానికే స్థాన మివ్వలేదు చూశావా ?

రాంభ—" నిర్ధనునకున్ స్థానంబు లేదియ్యెడన్ ".

కర్ణో—బఖ్సారీ! యెంత దురభిప్రాయపడ్డావు! నిన్ను వంచించడానికి చూస్తున్నానా? (Don't dream of it) డోంటు డ్రీం ఆఫ్ ఇట్. (Heartful) హార్టుఫుల్‌గా చెప్పిన వాక్యాలివి. డబ్బు కేవిధమైన లోటూ చెయ్యను. నామాట యెంతవరకు నిజమో (few days) ఫ్యూ డేస్‌లో నీవే తెలుసుకుంటావు.

రాంభ—పాపం అతనిహృదయం యెంతవేదన ననుభవిస్తోందో.

మధు—ధనమే ప్రాధాన్యంగా చూచేవాళ్ళకు జాలి యెందుకుంటుంది? దయాదాక్షిణ్యాలుంటే ధనమెలావొస్తుంది.

బఖ్సారి—(యోచించి తలపంకించి) నీమాటలు నాకు నమ్మకంలేదు.

కర్ణో—(Bank management) బ్యాంక్ మేనేజిమెంటు యికనుంచీ నేనే స్వయంగా చూడాలి. (Iron safe keys) ఐరన్ సేఫ్ కీస్ నాదగ్గరే వుంటాయి. తెలిసిందా?

బఖ్సారి—యిది అస్సలు నమ్మదగ్గ విషయంకాదు. మోహన్‌దాసేమాతాడు?

కర్ణో—మోహన్‌దాసా! మా మామ (Dismiss) డిస్‌మిస్ చేసి వెళ్ళగొట్టాడుగా......(నవ్వును)

బఖ్సారి—ఆఁ! కారణం?

కర్ణో—దొంగతనం చేస్తే వూరుకుంటారా?

బఖ్సారి—(తనలో) యిది నిజమా? (అని ఆలోచిస్తోంది)

మధు—యిది నిజమా?

రాంభం—యేమో? నేనూ అలాగే విన్నాను. కాని నమ్మలేను.

మధు—ఆమాటలు వినేసరికీ ఆశాలత మొలక లెత్తుతున్నట్లుంది. అదే నిజమైతే ఈశ్వర్లాలు భిక్షాటనచెయ్యకతప్పదు.

రాంభ—విధివిధానాన్ని యెవరు తప్పించగరు.

కర్ణో—బఖ్సారీ!

ఉ॥ యోజలు సేయ నేల నిజ ♦ మున్నది పల్కితి నమ్మరాదె యీ
వ్యాజపు ప్రేమజూపి యిక ♦ నైనను బొంకవగ రాదె రాదెయిం
భోజదళాక్షి రో కరుణ ♦ భృత్యుడ నీచరణాబ్జమానగా
నే జవదాట నెన్నటికి ♦ నిక భవదాజ్ఞకు చెంత జేర్పవే.

(అని పాదాల చెంత కూచుంటాడు)

మధు—ఆహా యెంత నీచానికి పాల్పడుతున్నాడు.

రాంభ—"కామాంధో వివేక సూన్యాత్"

బక్సారి—పాదాల దగ్గరెందుకు! తగుల్తాయి.

మధు—యిప్పటికి ము క్తి కలిగింది.

కతో—(కూర్చుని) పాదాలు తాకితే తప్పా?

మ॥ లలనారత్నము చెంత జేరి పొలయ ♦ ల్కన్ దేలుచో నెంత వా
రలకున్ దప్పవె పాదమంటుటలు మీ ♦ రన్ జాలు నేయెవ్వరున్
వలపున్ జేడియ పాదతాడనములన్ ♦ భావింప వేయింత యొం
దుల కే జంకిక నీ ప్రియుండ గద యే ♦ దోషంబు వాటిల్లునే.

(చెంపమీద చిన్నగా కొట్టును)

బక్సారి—మోట సరసాలప్పుడే మొదలు.

కతో—మోటసరస మేముంది. నిజమైన సంగతి చెప్పాను, అయినా పురుషుణ్ణి స్త్రీ పాదాక్రాంతుణ్ణి తేలిగ్గా చేసుకుంటుంది.

బక్సారి—బస్! యివ్వాళ ఆడుగులకు మడుగులొత్తుతున్నావు. రేపు ఇనప్పెట్టె తాళాలు చేతికొచ్చాక అసలు నేను కనపడ తానా ?

కతో—అప్పుడు (Delhi) డెల్హీనుంచి యింకో కర్తను తెప్పిస్తాను.

బక్సారి—అబ్బో ! యేమా డాబుసరి ! యీ వన్నెలమొగాని కర్రసేరు పసుపా ?

కతో—కాకేం (అని పెడతిరుగుతాడు)

బజారి—యిదుగో! యిటుచూడు. అయ్యో! యింతబిగింపా (అంటూ తనవైపు తిప్పుకుంటుంది.)

కతో—ఉహుం! (అని తిరక్కుండా వుంటాడు)

బజారి—యీ బెట్టింతవరకో చూస్తాను (అంటూ లోపలకు పోతుంది).

కతో—(చప్పుడు విని) కార్కుతీసి గ్లాసులో పోస్తున్నట్లుంది. యిక బెట్టుసరి పనికిరాదు. (అని నాలుక చప్పరించుకుంటూ లోపలికి పోతాడు.)

(అంత రాంఛందర్, మధురబాల యివతలకు వస్తారు)

మధు—ప్రియా చూశావా! బ్రాందిలోవున్న ఆకర్షణశక్తి మరొక దాంట్లో లేదు. యింత బెట్టుచేసిన వాడల్లా కుక్కలా పరుగెత్తాడు.

రాంఛం—యింతసేపట్నుంచీ యీకలహం లేకండా సఖ్యంగా వున్నట్లయితే యిప్పటి కెన్ని (Bottles) బాటిల్సు ఖాళీఅయ్యేవో!

మధు—వేశ్యలు బ్రాంది సీసాను భగవంతుడులా కొలుస్తారు.

రాంఛ—యెందువల్ల!

మధు—వృత్తి మొకుగుదువు గదా? చర్యలెలావుంటాయో తెలుసా.

మ॥ ఒకనిన్ రమ్మని పిల్చు,నింకొకని భృత్యుంజేసియేడ్పించు, వే
రొకనిన్ గాగిడజేర్చు నాడెడుమరొక్కన్ గూడి సయ్యాటలిం
కొకనిన్ సౌఖ్యములందు దేల్చు నొకడుద్యోగుండు చోరుండొకం
డొకడో! జూవరి బిచ్చగాడొకడు నయ్యో తాగుబోతొక్కడో.

మొత్తంమీద అందరికీ తిరుపతిపోకుండానే కళ్యాణంచేసి చిప్పచేతికిస్తారు.

రాంఛ—(అటుచూచి) మొత్తం మీద మీ యొక్క సిద్ధసంకల్పు రాలైంది.

మధు—యీ భాగ్యానికి యింతగొడవ యొదుకొచ్చింది. అయినా వేశ్యాపిశాచం పట్టిందంటే వెయ్యేళ్ళకైనా సర్వనాశనం చెయ్యంది విడవదు.

రాంఛ—అయిన మట్టుకు తెచ్చియిస్తూంటే సర్వాంగ క్షౌరమే అవుతుంది.

మధు—ఇవ్వకపోతే బండి నడవడంయెలా?

ఉ॥ మాడ నొసంగ కుండు నెడ ♦ మాటయెప్పూజ్యమగున్ సరాగముల్
కూడవు సుంకమీయకయె ♦ కొంగును వీవదు లంచమీక పో
రాడినచెంతరాదు నజ♦రాననొసంగక యున్న గూడ గా
జూడదు, రొక్కమున్ గొనక♦ జొచ్చుట యెట్లొకొ వేశ్య పజ్జకున్॥

రాంఛ—మధురా! నీవుకూడా వేశ్యవేగదా సాటివాళ్ళని......

మధు—సాటివాళ్ళా! నే ని వేశ్యకులంలో జన్మించినందుకు యెంత విచారిస్తున్నానో మీ కేంతెలుసు? యే నీచకులంలోనైనా జన్మించి మిమ్ము భర్తగా బడసినట్లుంటే చాలానంతోషించే దాన్ని. రామూ. మా అక్కతోపాటు మీరుగూడా నన్ను (Insult) ఇన్సల్టు చేస్తున్నారా?

రాంఛ—మధురా! విచారించకు. నీ అభిప్రాయం తెలుసుకోవాలని అలా అన్నానుకాని వేరుకాదు. నిన్నుగూర్చి నీ సమక్షంలో అనకూడదు కాని, సంసారస్త్రీలలోకూడా నీయంత సుగుణ వంతురా లుండటం అరుదు యెక్కడో తప్ప.

మధు—అలా అనకూడదు తప్పు.

రాంఛ—కాదు.

చ॥ పతియొక వాక్యమున్ బలుక ♦ భార్య మరొక్కటిపల్కు, కాదనన్
పతియది కాదనున్ సతియు,♦ భండనమానపుడందు దానిపై
పతి యెదియే నొనర్పుమన ♦ భార్య మరొక్కటిచేయు, నంతటన్
పతియలుగున్, బాగుల్ సతియు♦భామరొ యింతియె కాదెదంపతుల్.

మధు—సంసార స్త్రీలలోకూడ నెందరో సతీతిలకములున్నారు. కాని, యిట్టి గయ్యాళి గంపలుమాత్రము సాధ్వులనబడరు.

రాంభ—అదే నేచెప్పేదికూడా! మరినిన్ను సతీతిలకమనాలో తిలకములకు తిలకమనాలో తోచడంలేదు.

మధు—నాలోఅంత విశేషమేమీా లేదు.

రాంభ—అలాఅనకు పరిణయం కానంతమాత్రంచేత పాతివ్రత్యం లేకపోతుందా.

ఉ॥ ప్రేమ పవిత్రమై సతికి ♦ పెట్టని భూషణమౌచువెల్గ నీ
హేమపు సూత్రబంధన మ♦దేటికి గొడ్డుకుత్రాడువోలె నీ
వోమదిరాక్షి ప్రేమకు మ♦హోన్నత పీఠమలంకరించినా
వేమనవచ్చు సాధ్వివా మ♦హిం గల సాధ్వులకెల్ల సాధ్వివో॥

నా అదృష్టంచేత నాకు లభించావు.

మధు—మీా అభిమానం అలాఅనిపిస్తోంది చాలా ప్రొద్దుపోయింది. ఆరోగ్యం చెడుతుంది.

రాంభ—సరి పోదాంపద.

(యిద్దరూ వేస్తూవుండగా తెరపడును).



# మూడవ రంగము.

స్థలం: ఉద్యానవనం. వివిధరకాల పూలచెట్లుంటాయి. బెన్నులుంటాయి.
అక్కడక్కడ జనం కూర్చుంటారు.

ఒక మార్మూల కిషోరి తెల్లని సిల్కుచీర కట్టి జాకెట్టు తొడిగి వాల్జడ ముందుకు వేసుకుని వుంటుంది. కాళ్ళకు శాండెల్సు, చేతిలో ఒక నవల వుంటుంది.
అదోవిధంగా చూచుకుంటూ దీర్ఘాలోచనలో మునిగి మెల్లగా
అడుగులు పెట్టుకుంటూ ప్రవేశిస్తుంది.

కిషో—(పచార్లు చేస్తూ) (absurd) అప్సర్డు. అతని గుణం అలాంటిదికాదు. పెట్టెతాళాలు సంగ్రహించి కర్ణోర్బందే యీ పని చేసివుంటాడు....నిర్ధారణ యెలా?... కర్ణోర్బందుకు(D.G.) డి. జి. వున్నట్లు వినికిడి. ఆమె నెలాపోషిస్తున్నాడో...... యేమో. నాతండ్రితో దెబ్బలాడి తీసుకునే ధనం ఆవిధముగా ఉపయోగిస్తూ వుండవచ్చు......అంతటితో అది తృప్తిపడుతూందా?......(May be) మే బి. అదికూడా లేకపోతే.... అత నొక్కడేనని నిర్ధారణ యేముంది......మా యింట్లోంచి (Dismiss) డిస్మిస్ చేసినప్పట్నుంచీ......(తలవూపుతూ) మోహన్‌దాసుకు నేనెరుగని ధన మెక్కడనుంచి వొచ్చింది......యిదికొంచెం విచారించదగ్గదే......యీ (theft) థెఫ్ట్ నిజంగా మోహన్‌దాసే చేసివుంటే నా జీవితమే వ్యర్థం... (అని నిట్టూర్పు పుచ్చి) తాళాలు కర్ణోరకు దొరకడం అసంభవం...... మోహన్‌దాసు యేమరివుండడు...... ఊఁ! గ్రహచారం చాలకపోతే సరి...... యే భోజనసమయంలోనైనా జరిగివుండకూడదా?...... (తల వూపుతూ) ఊహాతీతమైన విషయం......... ప్రయత్నంలోంచి విరమించకూడదు...

(అంత పూర్వపు దుస్తులతో కరోర్చందు ప్రవేశిస్తాడు కొంచం తూలుతూ వుంటాడు.)

కరో—యెవరు, కిషోరీ, (lonely) లోన్లీగా యేంచేస్తున్నా విక్కడ?

కిషో—యేమీ లేదు షికారుగా వొచ్చాను.

కరో—యీ (garden) గార్డెన్లో నువ్వు నుంచుంటే, హా హా హా ఆ (beauty) బ్యూటీ యేంచెప్పను.

కిషో—(మొహం చిట్లించుకొంటూ తనలో) ఓహో! గ్రంధసాంగుడైనాడు. యిదేసమయం (ప్రశ్నా) సరేగాని, కరోర్ యిప్పుడు నీరాక యెక్కణ్ణించి?

కరో—చెప్పమన్నావా! ఆఁ... (అని నవ్వును)

కిషో—ఊఁ!

కరో—మరిచిపోయాను. కాదు. (forgotten) ఫర్గాటెన్.

కిషో—నాకు చెప్పకూడదు కాబోలు. పోనీలే (అని ఒకఅడుగు వెనక వేస్తుంది.)

కరో—కాదు, కాదు. చెప్తాను. (let me think) లెట్ మి థింక్. (అని బుఱ్ఱ గోక్కుంటాడు)

కిషో—పోనీలే. యింకోటి అడుగుతా చెప్పతావా?

కరో—(Ready) రెడీ. (అని చేతులు కట్టుకుంటాడు)

కిషో—నాకు అవసరంగా కొంత (money) మనీ కావాలి. యెవర్నడగను?

కరో—(Iron safe) ఐరన్ సేఫ్లో కావాల్సినంత.

కిషో—తాళంచెవులో.

కరో—నాకు (Hand over) హ్యాండోవర్ అయూకయిస్తాను.

కిషో—ఆలశ్యంలేదు.

కరో—దొంగతనం చెయ్యి.

కిషో—మరిచిపోయాను అనుకొన్నావేం. ల్లో శేమం యేమీలేదు.

కరో—(ముఖం చిట్లించి) హ హ హ హ. అది మోహన్‌దాసునడ గాలి. హ హ హ హ మోహన్‌దాసు నీకిస్తాడులే—

కిషో—నాకెందుకిస్తాడు.

కరో—నాకు తెలుసులేవోయ్ పిల్లా. హ హ హ హ. ఆఁ! యింకో మాట. ఒక్కసారి (Kiss) కిస్ చెయ్యనియ్యి. సంపాయించి యిస్తాను.

కిషో—అట్టే ప్రేలకు.

కరో—జబర్దస్తీకి జంకేదెవరు? (Stupid girl) స్టుపిడ్ గరల్ (force) ఫోర్సు చేస్తే యెవడడ్డమొస్తాడు?

తే॥ గీ॥ వాలి సుతుడంబరీషుడో ♦ వామనుండో
వీర కేసరి సుతుడు వి♦భీషణుండో
రామునకు కుంతి కనినట్టి ♦ రాఘవుండో
లచ్చితనయుడో యింక నే♦లంజకొడుకో॥

(అంటూ కిషోరిని సమీపిస్తాడు)

కిషో—(చెంపమీదకొట్టి) ఛీ అవతలకుపో.

కరో—(చెంపతుడుచుకుంటూ) చెంపమీద కొడతావా (అని చుర చురచూస్తాడు)

కిషో—యేమా చూపు?

ఉ॥ తాగినమైక మింత యెగ♦దట్టినా కండ్లకు, నోంటినుండ, నిం
కేగతి దీనికన్న తల♦పేమొ, ధనాంగన గాదలంతువో
రాగము జూపుచుంటివి, స♦రాగములాడకు "మగ్నితోడ" నే
భోగమునందెనో మిడుత పొందెద వాగతిపొమ్ము మూర్ఖుడా॥

కరో—హ హ హ భస్మం...అపరదమయుంతి! (I will see) ఐ విల్ సి. (అంటూ మీదికి వొస్తాడు.)

కిషో—(అటూ యిటూ చూస్తూ) యిప్పుడు గత్యంతర మేమిటి? (కరోర్ తో) కరోర్ జాగ్రతసుమా. మీాదికిరాకు. (Help. Help.) హెల్పు. హెల్పు. (అని కేక పెడుతుంది.)

కరో—ఆఁ! ఏ (Devil) డెవిల్ (Help) హెల్పు చేస్తాడో చూస్తాను. (అంటూ రెండుచేతులూ పట్టుకొని లాగుతూఁటే కిషోరి పెనగులాడుతూ వుఁటుంది. మోహన్‌దాసు పరుగెత్తి వచ్చి కరోర్పుందుమీాద పడి కొడతాడు. కరోర్ క్రిందపడి వొళ్ళు దులుపుకుంటూ లేచి మోహన్‌దాసును చూచి)

కరో— (పళ్ళు కొరుకుతూ) మోహన్‌దాస్ (I will see your end) ఐ విల్ సి యువర్ యండ్ (అంటూ పారిపోతాడు)

మోహన్—(కొద్దిగా నవ్వి) పారిపోతావేం (అంటూ కిషోరివంక చూసి) యిక నిర్భయంగా..................

కిషో—యిప్పుడు నీవు చేసిన ఉపకారానానికి ప్రత్యుపకారం యేం చెయ్యాలో తోచడంలేదు.

మోహన్—నీవేమీా చెయ్యనక్కర్లేదు. నీతండ్రిచేసిన ఉపకారమే చాలు.

కిషో—నాతండ్రి యే వుపకారం చేశాడు ?

మోహ—పెంచి,పోషించి,పదభ్రష్టుణిచేశాడు అదేమహోపకారం.

కిషో—(Sorry) సారి, అదికేవలం అన్యాయం; నిన్నన్యాయం చేసినది మాతండ్రికదా ? మరి నన్నెందుకు రక్షించావు.

మోహన్—ఒక అబల కంఠంలోంచి (Help) హెల్పు అనే పదం వినబడడంచేత దౌరాత్మ్యాన్ని నేనెప్పుడూ నిరసిస్తూవుండడంచేత.

కిషో—మోహన్ (అని అతని కళ్ళల్లోకి చూస్తుంది)

మోహన్—కిషోరీ (అని ఆమెకళ్ళల్లోకి చూస్తాడు)

కిషో—(కొంచం తలవొంచి) మోహన్ మా యింట్లో చౌర్యంచేసిం దెవరని నీ అభిప్రాయం ?

మోహ.—యింకేవరు.

కిషో.— ఆధారం ?

మోహ.—నిరాధారం.

కిషో.—నీ అపవాదు తొలగడం ?

మోహ.—నీతండ్రికి మేనల్లుసిమీాద వున్న మమకారంవల్ల, గుడ్డి నమ్మకంవల్ల, విమర్శనాజ్ఞానం లేకపోవడంవల్ల, వొచ్చిందీ అప వాదు. అందువల్ల నాకేబాధా కలగలేదే!

కిషో.—లోకులంతా మోహన్‌దాసు చౌర్యం జేశాడనిఅనడంలేదూ?

మోహన్—లోకం గుడ్డిది. ఒకతుచ్ఛుని నోటినుంచి యేదైనా ఒక వాక్యం వెలువడితే లోకులంతా అదే నిజమని నమ్ముతారు. అసలు యీలోకాన్ని (Care) కేర్ చేసేదెవరు?

కిషో.—అలా అనకూడదు. అన్యాకాంతంగా ఒకవ్యక్తికి మచ్చకలి గిందంటే ఆమచ్చ సాధ్యమైనంతవరకు తొలగించు కోడానికి ప్రయత్నించాలి ?

మోహన్—ఆప్రయత్నంలో కృతకృత్యులం గాకపోతే ?

కిషో.—ఫలాఫలాలు నిర్ణయించడానికి ఎవరికిశక్యమౌతుంది? మనం ఏ కార్యంతలపెట్టినా కృతకృత్యులమౌతామనే ప్రారంభిస్తామూ?

మోహన్—ఆ ధైర్యంలేంది యెవ్వరూ ఏపనీచెయ్యలేరు.

కిషో.—ప్రయత్నలోపం అయిందనే విచారం లేకండా...

మోహన్—విచారమా! యీజన్మకింకేం విచారం. యికయెవ్వరూ ఉద్యోగమియ్యరనే విచారమా? తలిదండ్రులను పోషింపలేననే విచారమా? నావొక్కపొట్టనింపు కోలేననేవిచారమా?

కిషో.—తలిదండ్రులు లేనిలోటు యివ్వాళయెవ్వరూ తీర్చలేరు కాని యేదోవిధంగా (Life lead) లైఫ్ లీడ్ చెయ్యొద్దూ?

మోహన్—(Miserable life) మిజరబుల్ లైఫ్. ఇందుకోసం యికమీాదట (Slavery) స్లేవరీ చేస్తానన్నమాట అబద్ధం

దేశమంతా దాశ్యానికి తలొగ్గుతున్నదికాని యీ దాశ్యంలో గౌరవంలేదు సుఖంలేదు. ఆత్మస్వాతంత్ర్య గౌరాన్ని గోల్పోవడమే యిందుకుఫలితం. అలాంటి నీచదాస్యానికి తలొగ్గుటకన్న సేద్యం చేసుకొని స్వేచ్ఛగా జీవించడం మంచిది.

కిషో—భూమి సంపాదించకుండానే ?

మోహన్—ఇదివరకే ఆర్జించివున్నది. అది నా కొక్కడికే కాదు. ప్రతిజీవికీ హక్కుగల భూమి.

కిషో—మోహన్ యెంత విరక్తిజెంది మాట్లాడుతున్నావ్. యిది నీకు ధర్మమేనా ?

మోహన్—అందువల్ల యెవరికీ అపకారం కలగదే ?

కిషో—నాకే అపకారం. నిన్ను (సిగ్గుతో తలవంచి) నేను ప్రే-మిం-చా - ను.

మోహన్—అందువల్ల ఫలం లేదేమో ?

కిషో—(ఆతురతతో) యెందువల్ల? నీవు నన్ను ప్రేమించడం లేదా ?

మోహన్—నీ తండ్రి నిన్ను కతోర్‌చందుకు యిచ్చి వివాహం చెయ్యాలని వున్నాడు.

కిషో—అలా యెప్పటికీ జరగదు.

మోహన్—నీ తండ్రి సర్వస్వాతంత్ర్యుడు. నేను చోరుణ్ణి. సంఘం బహిష్కరిస్తుంది.

కిషో—కన్నకారణంచేత నాశరీరంమీద ఆయనకు హక్కుంటే వుండవచ్చు. కాని నా హృదయంమీద యెవరికీ హక్కులేదు. నా ఆత్మకు సర్వస్వాతంత్ర్యం వున్నది. ఇంత యెందుకు ?

చ॥ జనకుడు కోపగించిన కు సంఘము తన్ను బహిష్కరించినన్
విను మొకలెక్కయే, విమల ప్రేమపిపాసకి కెందు జోరుడై,
మనము హరించునాతడె, ర మాపతిగా దలపోసి, దాశ్యమున్
బొనరిచి, ప్రేమ విఘ్నమయి పొల్చిన బూనదె బ్రహ్మచర్యమున్.

మోహన్—కిషోరీ నవనీతంలాంటి నీ హృదయంలో నిశ్చల నిష్కళంక ప్రేమ పరమపవిత్రమై పరంజ్యోతియై ప్రకాసించడం నా మనో చక్షువులతో చూడగల్గుతూనే వున్నాను. కాని, నేను కఠినహృదయుణ్ణి. నీ ప్రేమను సార్థకంచేయలేక పోతున్నాను. అతి సున్నితమైన నీ మనస్సుకు నొప్పి కలగజేస్తున్నాను.

కిషో—మోహన్ యెందుకలా దూషించుకుంటావు. ఒకా నొకప్పటికైనా మన ప్రేమకు ఫలితం వుందనే నా దృఢవిశ్వాసం. ఒకవేళ అలా కాకుండా యీ ప్రేమజ్యోతియే చల్లారితే ప్రపంచమే సూన్యమౌతుంది. అప్పుడు శాశ్వతంగా అమర జ్యోతి వెలుగుతుంది.

మోహన్—కిషోరీ! నీ దృఢనమ్మకం విని సంతోషించాను. కాని మనస్సుకు సహజంగా చంచల స్వభావం వుంటుంది.

కిషో—మోహన్ సరిగాని, భోజన మెక్కడ ?

మోహ—హొటల్లో.

కిషో—పడక ?

మోహ—యేబంధువులున్నారు. నీతండ్రియూ దర్బాంధుషు. అంతకన్న మెవరూలేరు. ఉన్నా యీజన్మలో బంధువుల నాశ్రయించను.

కిషో—మరి.

మోహ—అద్దెయిల్లు.

కిషో—హొటలు భోజనం - అద్దెయిల్లు. (అని ఆలోచిస్తుంది.)

మోహ—ఆర్జనలేకుండా హొటలు భోజనం, అద్దెయిల్లు అని సంశయిస్తున్నావా ? నా శ్రేయోభిలాషి. రాము లేడూ ?

కిషో—పొరబడ్డాను. అతనుచాలా మంచివాడు. యితరులకు చాలా సాయం చేస్తాడు.

మోహన్—అతని మైత్రి ముందు యే బంధువు పనికిరాడు.

కిషో—(By the by) బై ది బై నీవు వేశ్యాగృహంలో వుండగా రాంఛందర్ కూడా చూసినట్లు కఠోర్చందు చెప్పాడుకాదూ!

మోహన్—(Quite False) క్వైట్ ఫాల్సు.

కిషో—మీా యిద్దరికీ అంత విరోధానికి కారణం ?

మోహన్—నాకేం తెలియదు. కాని, కిషోరీ! నీవు నన్ను అనుమానించి యిలా ప్రశ్నిస్తున్నా వనుకుంటాను.

కిషో—మోహన్! పొరబడుతున్నావు. నిన్ను యెంతచూచినా నాకు తనివితీరదు. చూడు! ఆ తుమ్మెద వెళ్ళిపోతూంటే ఆ పుష్పం తన ఆకర్షణశక్తివల్ల భ్రమరాన్ని పోకుండా ఆపుతోంది.

మోహన్—నీ ప్రేమ మగణ్యమైందని యీావరకే చెప్పాను. (అని ఒక పుష్పాన్ని కోసి తెస్తాడు.)

కిషో—పుష్పాన్ని కోశావా? దాని కోసం తుమ్మెద యెంత విచారిస్తుందో.

మోహన్—ఒకరు విచారిస్తేగాని, ఒకరికి సౌఖ్యం గలగదు. యిది ప్రకృతి ధర్మం. యీాపుష్పాన్ని నీ జడలో తురిమి ఆనందిస్తాను.

కిషో—(చిరునవ్వుతో ఒకసారి మోహన్ కళ్ళల్లోకి చూసి తల వొంచుకుంటుంది. మోహన్ ఆ పువ్వును కిషోరి తలలో వుంచుతూ వుండగా ఈశ్వర్లాలు ప్రవేశిస్తాడు.)

ఈశ్వ—(యిద్దర్నీ చూచి) మోహన్‌దాస్! నీకు సిగ్గులేదూ? !

మోహన్—గౌరవహీనమైన వాక్యా లుచ్చరిస్తే సహించడం కష్టం.

ఈశ్వ—చోరుడికికూడా గౌరవహీనమా? సహించక?

మోహన్—సహించడానికి నే నిప్పుడు నీదాస్యంలో లేను. స్వతంత్ర జీవిని.

కిషో—యిప్పుడు దూషించవలసినంత అగత్యం యేమికలిగింది?

ఈశ్వ—నీతో మాటలాడటానికి అతని కేం అగత్యం కలిగింది ?

కిషో—నేను పిల్చాను. యింటికి పోకండా ఆపాను. కులాసాగా మాట్లాడుతున్నాను.

ఈశ్వ—తలలో పూవులు పెట్టించుకుంటున్నావు. యింక......ఊఁ! యెంత నిర్భయంగా సంచరించడానికి తలకొన్నావ్? స్త్రీ జన్మమెత్తలేదూ? మన యింట్లో చౌర్యంచేసి యింట్లోంచి వెళ్ళ

గొట్టబడిన దొంగతో కులాసాగా సంభాషిస్తున్నావా? అది కూడా యేకాంతంలో–నా గౌరవం అంతాదగ్ధం చేస్తున్నావా?

మో—నేను గౌరవహీనమైన పనియేమీ చేయడంలేదే?

ఈశ్వ—యింతకన్న యేంచెయ్యాలి. నేను నిరసించేవాణ్ణి నీవు భూషిస్తున్నావు. ఒక దుష్టునితో, ఒకదరిద్రి దామోదరుడితో...

మోహ—అదే నేను కూడదన్నాను. దుష్టుడేవడు? నీవైశ్వర్యవంతుడవేయాగాక, గుణరాహిత్యమైన ధనం యెందుకు తగులబెట్టనా? ఒకరిని మోసంచేసి ఆర్జిస్తున్నావు కోటానుకోట్లుగా. ఒకరికి సహాయం చెయ్యడం నీచేతకాదు. నీ కుక్షినిండా నీవు భుజించలేవు. అలాంటి ధనం కొంత కాదు అంతా దొంగిలింపబడ వలసిందే.

మ॥ ధన మార్జించుటకాదు కోట్లకొలదిన్ ♦ దానంబు, ధర్మంబు స ద్వినియోగంబులజేసి, స్వానుభవమున్ ♦ వీక్షింపగాజెల్లు, నెం దును, లోభత్వమునూన, నాశనముజెం♦దున్ తథ్యమాద్రవ్య మూ రను బిచ్చంబునుబుట్ట దంత దరికిన్ ♦ రానీయడొక్కండునున్.

ఈశ్వ—ఓరినీచుడా? యెన్ని దుర్భాషలాడుతున్నావు. నిన్ను బందెపెట్టించకుండా విడిచిపెట్టడం నాది పొరపాటయింది. బిచ్చమెత్తుకునేగతి నాకుగాదు.

మోహ—అవును నాకేపట్టింది. బిచ్చగాడికి వున్న గౌరవంకూడా ధనవంతుడికిలేదు. గ్రామంలో యాచించి గ్రాసం జరుపుకుంటూ యేచెట్టునీడనో పవ్వళించి నిశ్చింతగా కాలంగడుపుతున్నాడు. ధర్మంచేసేవాళ్ళని భూషిస్తూ, వానిమేలు కోరుతున్నాడు. లోభులకు ధర్మం చెయ్యమని బోధించి చెయ్యకపోతే దూషిస్తున్నాడు. అంతేకాని ఒకరిని మోసగించడు. యే అక్రమం చెయ్యడు అలాంటి బిచ్చగాణ్ణి ధనమదంచేత దూషించడం కేవలం అవ్యక్తం. యివ్వాళ బందెబెట్టించినా రేపు నీకూ

నీ దౌరాత్మ్యానికీ తగిన ప్రతీకారం జరిగి తీరుతుంది. యిది నిశ్చయము. (నిష్క్రమించును)

ఈశ్వ — ఆఁ యేమిటీ? యిక నిన్ను పేక్షించకూడదు. నీకు కారాగృహం తప్పదు.

కిషో — (తనలో) సజ్జనుడు దూషణవాక్యాలెప్పుడైనా సహిస్తాడా?

ఈశ్వ — ఛీ నోరుముయ్యి. నీకు కూడా తగిన బుద్ధిచెప్పాలి నడువు. ( నెట్టుకొని పోతూవుంటాడు తెరపడుతుంది. )



# నాల్గవ రంగము.



స్థలం — సముద్రతీరం, సాయంసమయం. ప్రవేశము : సరోజ తెల్లనిసిల్కు చీరకట్టి, సిల్కుజాకెట్టు తొడుగుకుంది. మెడలో ఒకగొలుసు, పొడుగాటిజడ వేళ్లాడుతూంటుంది. లోలాకు లూగుతుంటాయి. ఒకచేతికి రిష్టువాచి రెండవచేతికి రెండుగాజులు తళతళ లాడుతూంటాయి. (Lady shoe) లేడీ షూ వేసుకుని యిసుకతిన్నెమీద విలాసంగా పడుకొని పేపరు చూస్తూవుంటగా తెరలేస్తుంది. తరువాత ఈశ్వర్లాల్ తెల్లపంచ, కోటు, తలగుడ్డ, బిళ్ళమడతకండువా, కళ్ళజోడు, వెండిపొన్నుకఱ్ఱ, ఆకుచెప్పులు తొడిగి సబ్ ఇన్స్పెక్టరుతో మాట్లాడుతూ ప్రవేశిస్తాడు. సబ్ ఇనస్పెక్టర్ చంద్రశేఖర్ యూనిఫారం (Uniform) లో వుంటాడు.

చంద్ర — పనిపూర్తి అయాక అన్నమాట చెల్లిందుకోటానికి వెనుదీస్తారెందుకు?

ఈశ్వ — అబ్బే వెనుదీయడంలేదు. అరెస్టుచెయ్యడంతోనే పనిపూర్తి అయినట్టే?

చంద్ర — మీరు నన్ను కోరిందంత వరకే, కేసుగెలవడం గెలవకపోవడం మీమీద ఆధారపడి వుంటుంది.

ఈశ్వ—మీసహాయం లేంది అదిమాత్రాయెలా ?

చంద్ర—యిలా పేచీ పెడుతుంటే మాకు ఉత్సాహం యెలావుంటుంది.

ఈశ్వ—అయితే ప్రస్తుతం కొంత తీసుకోండి.

చంద్ర—మళ్లీకొంత యేమిటండీ?

ఈశ్వ—పరవాలేదు. తరువాత సర్దుతాను (అని ఇన్ స్పెక్టర్ జేబులో నోట్లుపెట్టి) అవసరమైన పనివుంది వెళ్లాలి తరువాత కలుసుకుంటాను (అనిత్వరగా పోతాడు)

చంద్ర—యెక్కడో లోభిలా అగుపడు తున్నాడు. అరెస్టుచేసేవరకూ ప్రాణంతీశాడు. అందులోను యెప్పుడో జరిగిన నేరం.

సరోజ్—యిది బాగుంది. (అంటూ కూర్చుని) ది మ్యారియేజ్ ఆఫ్ మిష్టర్ గోకుల్ ఛంద్, యం. యస్. సి. విత్ శ్రీ శ్రీముఖి యంగ్ విడో డాటర్ ఆఫ్ చల్లారాం విల్ టేక్ ప్లేస్ ఆన్ డి*......... ఆల్ ఆర్ కార్డియల్లి వెల్ కమ్డ్ టు బ్లెస్ ది కపుల్.

బ్రహ్మసమాజమ్, కొల్హాపూర్.

The Marriage of Mr. Gokulchand, M. Sc. with Sri Sreemukhi young widow Daughter of Chellaram will take place on D *........................All are Cordially welcomed to bless the Couple.

Brahma Samaj, KOLHAPUR.,

* (యిచ్చట నాటక ప్రదర్శన తేదీకి రెండుమూడు రోజులు పైతేదీ నుంచుకోవాలి.)

చందిని—(చూచి) యెప్పుడో చూచిన మొగమే (అంటూ దగ్గరకు వెళ్ళి) యేమమ్మాయ్ మళ్ళీ చదువు బాగుంది.

సరోజ్—(చూచి పేపరుయిచ్చి కొంచెం తొలగి నుంచుంటుంది) (wonder) వండర్.

చందిని—(చదువుకుంటూ కూర్చుని) బాగుంది. ప్రపంచంమీద బ్రహ్మసమాజాలూ (widow homes) విడోహోమ్సు

వొచ్చాక చాలామంది విడోస్‌కు బాధలు తప్పతున్నాయి. కూచో, నిలబడ్డావేం నిన్నెక్కడో చూచినజ్ఞాపకం.

సరోజ్—(As you like it) యాజ్ యు లైక్ ఇట్. నాటకానికి మొన్న మీరుకూడా.........

చంద్రశేఖర్—(yes, yes) యస్, యస్ అక్కడే చూచాను. నిజంగా ప్రేమ ఒక ప్రవాహం లాంటిది.

సరోజ్—అసిధంగా నాటకం వ్రాయడం షేక్స్పియరుకే తగిపోయింది.

చంద్రశేఖర్—నీ పేరు.

సరోజ్—సరోజ.

చంద్రశేఖర్—తగినపేరు. నీ కింకా (Marriage) మ్యారియేజ్ కాలేదనుకుంటాను.

సరోజ్—అయింది. కాని సంఘానికి బలి అయినాను.

చంద్ర—(Poor creature)పూర్. క్రీచర్ యేవృద్ధుడికో విక్రయించి వుంటారు.

సరోజ్—వృద్ధుడు కాడట.

చంద్ర—కాకపోతే యవ్వనుడై వుంటాడు. నీవుబాలిక వాడంచేత దుర్వ్యసనాలకు జిక్కిమృత్యువాతబడి వుంటాడు!

సరో—అంతే. యవ్వనానికి యవ్వనమేసరి తూగుతుంది కాని యవ్వనానికీ వృద్ధాప్యానికి యెంతసఖ్యమో యవ్వనానికి బాల్యానికీ కూడా అంతే.

చంద్ర—(Certainly) సర్టెన్లి. యీవిధంగా నీలాంటి పిల్లలుయెంత మందిసంఘానికి బలిఅవుతున్నారో? నీవుమళ్లీ (Remarriage) రీమ్యారియేజ్.........

సరో—(సిగ్గుపడి తలవంచు కుంటుంది)

చంద్ర—సిగ్గెందుకు చిన్నవయస్సు. జీవితాంతంవరకూ............

సరో—మీ ఫ్యామిలీ యిక్కడే వున్నారా అండి ?

చంద్ర—నీభావం నేను గ్రహించుకున్నాను. నాభార్య చనిపోయింది. నేనూ అదే ప్రయత్నంలో వున్నాను.

సరో—(చంద్రికా కళ్లల్లోకి ఒక సారిచూచి) విడోవర్ విడోని వివాహంచేసుకోవడం అనేది గొప్పవిషయం.

చంద్ర—సందిగ్ధవచనా లెందుకు. ఆనాడు డ్రామా (Hall) హాలులో చూచినప్పుడే నీ రూపం నన్నాకర్షించింది. అప్పట్నుంచీ నీ అభిప్రాయం కనుక్కోవాలనే ప్రయత్నంలో వున్నాను. కాని అది సంభవించలేదు. (అంటూ సరోజ్ వంక చూస్తాడు)

(పదహారు సంవత్సరాల లేప్రాయం. మున్నితమైన శరీరం, తూచినట్టు ఒడ్డూపొడుగూ చాలా అందమైన ముఖవిలాసం. పంట్లాంతొడిగి కోటులేకుండా హాటు ధరించి ముకుందలాల్ ప్రవేశిస్తాడు)

ముకుం— (చూచి) సరోజ-సబ్ యినస్పెక్టరు...సరోజాను పిల్చి అడుగుదామా? ఇది సమయంకాదు. (అని వెళ్ళిపోతాడు)

సరో—మీరు యీ (Town) టౌనుకు సబ్ ఇనస్పెక్టరా?

చంద్రిక—అవును. (అంటూదగ్గరజేరి చెయ్యి పట్టుకోపోతాడు)

సరో—(చేయి తీసుకుంటూ) క్షమించండి. విధ్యుక్తంగా......

చంద్రిక—(O yes) ఓ యస్ అలాగే. రహస్యానికి యీ సంఘాలని లెక్క చేసే దెవరు? (కానిస్టేబుల్ ఒకడు ప్రవేశించి చూస్తాడు.)

కానిస్టేబుల్—శృంగారఘట్టంలో వున్నట్లున్నారు యెలా పిలవడం?

సరో—యింకో విషయం. వితంతు వివాహాలని గురించి కొంత ప్రచారం చెయ్యాలని వుంది.

చంద్రిక—అభ్యంతరంలేదు. ఉద్యోగానికి భగంలేకుండా సాధ్యమైనంతవరకు నేనుకూడా పాల్గొంటాను.

కాని—తప్పదు. పిలుస్తాను. బాబూ!

చంద్రిక—ఆఁ యెవరూ? 192, యెందుకూ? (అంటూ లేచివస్తాడు సరోజ కూడా వొస్తుంది)

కాని—పెద్దబాబుగారు ఆఫీసుకువొచ్చారు. మిమ్మల్ని పిలవమన్నారు.

చంద్రి—సరోజ! (Circle Inspector) సర్కిల్ ఇనస్పెక్టరు పిలుస్తున్నాట్ట. తరువాత కలుసుకుందాం. నీఅడ్రెస్......

సరో—యిదిగో (అని అడ్రెస్ కార్డు యిస్తుంది)

చంద్రి—సరేవొస్తాను. (అని కానిస్టేబుల్‌తో పోతాడు)

సరో—నాకోర్కె తీరేకాలం ఆసన్నమైంది. (అంటూ ఇంకోవైపు చూస్తుంది. ఆహా! ఏమి యీ (beauty) బ్యూటీ. యింత చక్కదనం యికెవరికైనా వుంటుందా. యీ సబుయినస్పెక్టరుతో సంభాషించకపూర్వం యీ సుందరమూర్తి కనపడ్డట్టుంటే, యేవిధంచేతనైనాసరే యీ సుందరమూర్తిని వివాహం చేసుకునేదాన్ని. ఒకవేళ నిరాకరిస్తే అతనిచెంత దాశ్యం చేసి జీవించేదాన్ని. ఇప్పుడు (try) ట్రై చెయ్యనా? ఛీ, ఛీ. నాకు యెంత నీచపుబుద్ధి పుట్టింది. ఒక యువకుడికి నాహృదయాన్నిచ్చి, అతని హృదయాన్ని తీసికొని మళ్ళీ యింకోరిమీద దృష్టి ప్రసరింపజేయుడమా? తప్పు. అలా చేయకూడదు. సఖ్యం కుదురుతే సోదరప్రేమ జూపి ఆనందించవచ్చు.

ముకు—(తిరిగి ప్రవేశించి) సరోజా? (Good morning) గుడ్ మార్నింగ్.

సరో—(Good morning) గుడ్‌మార్నింగ్. నాపేరు మీకెలా తెలుసు.

ముకుం—కిషోరి చెప్పింది. కాని, రాంఛందర్ యెక్కడ వుంటాడో తెలుసా?

సరో—యీప్రాంతాలకే వొచ్చివుంటాడు. (అని అటూ యిటూ చూచి) అడుగో పిలుస్తాను. రాంఛందర్ (అని కేకపెడుతుంది)

రాంఛం—(మధురబాలతో కూడా ప్రవేసిస్తాడు. యిద్దరూ సమయోచిత వషాలతో)

మధు—సరోజా! ఏమైనా ప్రచారం చేస్తున్నావా?

సరోజ—చేస్తూనేవున్నాను.

రాంభం—ఈ యువకు డెవరు ?

సరోజ—నీకోసమే వెతుకుతున్నాడు.

ముకుం—నమస్తే. యీ (Letter) లెటరు మీ కందచెయ్యాలని (అంటూ వుత్తర మిస్తాడు)

రాంభం—మీ పేరు?

ముకుం—ముకుంద్.

రాంభం—(వుత్తరం చదువుకొని) దుర్మార్గుడు (అంటూ మధురకు యిచ్చి) కిషోరిని మీ రెలా యెరుగుదురు ?

ముకుం—ఆమె నా(Cousin sister) కజిన్ సిష్టర్ (collage mate) కాలేజ్ మేట్ కూడాను.

మధు—పోలికెలుకూడా వున్నాయి. రామూ! మోహన్ దాసు విషయం యేం చేస్తావు.

రాంభం—(Evening time) యీవినింగ్ టైమ్. ఇప్పుడేంచేస్తాము? రేపు మేజస్ట్రేటుకోర్టులో (Bail) బెయిల్ పిటీషన్ పెట్టాలి.

మధు—యీలోగా (Sub Inspector) సబ్ యినస్పెక్టరుతో మాట్లాడివుంచితే?

ముకుం—సబుయినస్పెక్టరు ఇంతకుముందు యిక్కడవున్నట్లున్నదే. (అని సరోజవంక చూస్తాడు)

సరోజ—(ముకుందునిచూస్తూ) సర్కిల్ రమ్మన్నాడని కబురొచ్చింది. (అని తల వొంచుకుంటుంది.)

ముకుం—చెల్లీ! కించపడతా వెందుకు ?

ఉ॥ ఎన్నడో నీ వెరుంగవు ♦ డెవ్వడో సూత్రముగట్టె దాన నే
మున్నది దాశ్యబంధ మత ♦ డుర్విని వీడ వితంతు వాదువే?
యన్నులమిన్న, నిన్ను మన♦సార వరించె నితండు ప్రేమ నీ
కున్నది మీ రెదంపతు ల♦హో! యని మెచ్చగవచ్చునియ్యెడన్.

మధు—ఇందుకు పెద్దలెవరైనా దూషిస్తారని భయమా ? వారిని లెక్కపెట్ట నక్కర్లేదు.

మ॥ జవసత్వంబులు దూరమై పరుల సౌఖ్యం బెన్నగాలేక పూ
ర్వవయోబాధిత మన్మథుల్ మరచి బృవ్వల్ దిట్టు నే డిట్లు వృ
ద్ధ వశిష్ఠాదులమంచు "తంతుతెగి నంతల్ ప్రేమ నింకొక్క బాం
ధవు వైవాహికమైన జవ్వనిని" పెద్దల్ ధర్మరాహిత్యులై॥

సరోజ—అందుకుకాదు. నిశ్చయం కాకుండా వెల్లడి.........

రాంఘం—ఓహో! అదియా సరోజా నిశ్చయమైనట్లే తలంచు. ఆబాధ్యత మేము వహిస్తాము.

సరోజ—(ముకుందునివంక నీ అభిప్రాయ మేమన్నట్లుగా చూస్తుంది)

ముకుం—వివాహం జరిగితీరుతుంది. సరోజా భయపడకు. మా కిషోరి రేపు నిన్నొకసారి రమ్మని చెప్పమన్నది.

సరోజ—(O. K.) ఓ. కె. యికపోదాం.



# ఐదవ రంగము.



స్థలం—ఈశ్వర్లాలు గృహంలో ఈశ్వర్లాలు పంచా లాల్చీతో అటూ యిటూ తిరుగుతూ కోపం నటిస్తూవుంటాడు.

ఒకసోఫా రెండు కుర్చీలూవుంటాయి. తెర లేస్తుంది.

ఈశ్వ—యెటుపోయి వుంటుంది...జెయిల్లోవున్న మోహన్‌దాసు దగ్గరకుపోయిందా...కన్నకూతుర్ని అదుపులోవుంచడం శక్యం గాకుండావుంటే...యీ మోహన్‌దాసు పరమ శత్రువైనాడు...తుచ్ఛుడు నీచుడు...దుర్భాషలాడతాడూ! గృద్ధ వచ్చిపిల్లను వెక్కిరించినట్లుంది. దీనికి యేవో మాటలు చెప్పి వల్లో వేసుకొని వుంటాడు. ఛీ ఛీ తలబ్రద్దలై పోతూంది (అంటూ సోఫాలోకూచొని చేతుల్లో మొగంపెట్టుకుంటాడు. యింతలో గదితలుపు చప్పుడౌతుంది)

ఈశ్వ—(తలయెత్తిచూచి) యెవరది కిషోరీ? (అంటూచూస్తాడు)

కిషో—(జడఅల్లుకుంటూ ప్రవేసిస్తుంది) ఆఁ !

ఈశ్వ—యిప్పుడెక్కడ నుంచివొస్తున్నావు?

కిషో—నా (Bed Room) బెడ్ రూంలోంచి.

ఈశ్వ—యింతకుముం దక్కడ లేవే?

కిషో—నీవు చూడ్డం పొరపాటు. నేనుగదిలోనే వున్నాను.

ఈశ్వ—లేవు నన్ను మోసం చెయ్యలేవు.

కిషో—నీవుచూస్తుండగానే నెక్కడనుంచి వొచ్చా నిప్పుడు ?

ఈశ్వ—యింతకు ముందు సంగతి?

కిషో—ఒకవేళ నేను పెరట్లోకి వెళ్లినప్పుడు గదిలో చూశావేమో.

(అంటూ కుర్చీలో కూచుంటుంది)

ఈశ్వ—పెరట్లోకూడా లేవే?

కిషో—పెరట్లో నీకెలా అగుపడతాను.

ఈశ్వ—బాగుంది.

కిషో—నీకు నామీద యీ అకారణ ఆగ్రహం యెందుకు? బాబా!

ఈశ్వ—అకారణం కాదు సకారణమే.

కిషో—యేమా కారణం?

ఈశ్వ—నీ నిర్లక్ష్య స్వభావమే.

కిషో—నేనేం నిర్లక్ష్యం చూపాను?

ఈశ్వ—అంతా నిర్లక్ష్యమే. శశోర్చుందుని వివాహంచేసుకోమంటే...

కిషో—యిప్పుడు నావివాహానికి తొందరేమిటి బాబా! (అనినవ్వుతుంది)

ఈశ్వ—కాదు. చేసుకొనితీరాలి.

కిషో—తండ్రీ కన్నావు. పెంచావు. విద్యనేర్పించావు. పెద్దదాన్ని చేశావు. నీబాధ్యత అంత వరకే. యింక నా బాగోగులుచూచు కోవలసింది నేనుకదా!

ఈశ్వ—చాలు. యీ ఉపోద్ఘాతంకట్టిపెట్టు. ప్రపంచంమీద యెవరూ తమ కూతులకు వివాహాలు చెయ్యడం లేదా? ప్రతి బాలికా తన బాగోగులు తానే చూచుకుంటోందా?

కిషో—కన్నకూతురుకు తండ్రి అక్రమం చేస్తున్నాడు. పశువులలోనే కాదు. యింక యే జీవరాసులలోనూకూడా యింత అక్రమం జరగడం లేదు.

ఈశ్వ—వివాహం చెయ్యడం అక్రమమే?

కిషో—యెందుకు కాదు. తాను జన్మించిం దెందుకో వివాహమనగా యేమిటో పతి వలని ప్రయోజన మేమో ప్రేమ యెట్టిదో తెలియని చిట్టిపాపకు వివాహంచేసి యెలాగైనాసరే నీ వీ భర్తను సేవించి నీ నూరేండ్ల జీవితం గడపమని చెప్పడం అక్రమం కాదా?

ఈశ్వ—అగును. చాలా అక్రమం. వేలకువేలు కట్నాలు పోసి వరుణ్ణి తేవడం అక్రమమే. ముద్దు ముచ్చటలు చెల్లాలని కొల్లగా వ్యయం చేసి వివాహం చెయ్యడం అక్రమమే. ఆభరణాలు చేయించడం అక్రమమే. యింత యెందుకు ఆడపిల్లను కనడమే అక్రమం.

కిషో—వరుణ్ణి కొనడానికి పశువుని కొనడానికి తారతమ్యం యేమీ కనిపించడం లేదు ధనికుడు కట్నంపోసి వరుణ్ణి కొంటున్నాడు. అది పేదవానికి ప్రాణకంటక మౌతోంది. ద్రవ్యం కర్చుపెట్టి అయిదు రోజులు చేస్తేకాని వివాహంకాదా? యింత వ్యయం మంగళసూత్రము కోసమే కదా? ప్రేమసూత్రం హృదయానికి కట్టాలిగాని యీ బాహ్యసూత్రంతో పనేముంది?

మ॥ విమలంబై నవకోటి భాస్కర విభా ♦ విభ్రాజమై స్వర్గ ని
ర్గమ మార్గంబయి దుర్గమ ప్రణయ సా♦మ్రాజ్యాధి దైవంబునై
భ్రమరాహిత్య త్రివిష్టపోజ్వలిత క♦ల్పంబౌచు జెన్నొందు, ప్రే
మ మమూల్యా భరణంబుగా జెలగ హే♦మంబేల కాంక్షింపగన్.

యీ అనవసర వ్యయాలకు అయేధనం, యీకట్నం యిచ్చే ధనం కలిపి, తన పుత్రికను, ఆమె ప్రేమ ననుసరించి యెంత నిరుపేదయైనా సరే వివాహంచేసి జీవనోపాధి యేర్పర్చరాదా?

యెంతో అనుకూలంగా ఆ దంపతులు ప్రేమసామ్రాజ్యాన్ని పరిపాలించరా?

ఈశ్వ—తండ్రిచేసేవన్నీ అక్రమాలయ్యేప్పుడు, జీవనోపాధి యేర్పర్చడం మాత్రం క్రమమా?

కిషో—అదీ అక్కర్లలేదు. జవ్వని, తనప్రేమ సామ్రాట్టుతోకూడి యింటింటా బిచ్చమెత్తుకొని ఉచ్ఛిష్టాన్నాన్ని భుజించినా, అది మృష్టాన్నభోజనమే. పైకొంగు పరచుకొని, చెట్లనీడ పవ్వళించినా, అది అంతఃపురోద్యానవనమే.

ఈశ్వ—సరి. యింకేం! నాధనంతో నీకేమీ అగత్యంలేదు. నాయింటితో నీకేమీ అగత్యం లేదు.

కిషో—లేదు నాకక్కర్లేదు. నీయింటితో నాకు పనిలేదు. యిదిగో యిప్పుడే పోతున్నాను. (అని రెండడుగులు నడుస్తుంది.)

ఈశ్వ—(లేచి చేతులచాచి)కిషోరీ! కిషోరీ! పోకు. నన్ను దుఃఖపెట్టకు. రా కూచో. (అంటూ తీసుకొచ్చి దగ్గరకూచోపెట్టుకొని) అమ్మా! కతోర్చేందుకు మాత్రం రూపం తక్కువా. యవ్వనం తక్కువా? నీ మేనబావ. ఒకయింట్లో పెరిగి ఒక కంచంలో తిని ఒక మంచంలో పవ్వళించాడు. ఒకచోట విద్య నభ్యసించారు.

కిషో—బాబా! అంతానిజమే. (Love is blind) లవ్ ఈస్ బ్లైండ్.

ఈశ్వ—అమ్మా! మీ అమ్మ నన్ను ప్రేమించే వివాహం చేసుకుందా? మేము సుఖించలేదా?

కిషో—అందువల్లనే అకాలమృత్యువు పొందిందని విన్నాను. అది అలా వుంచు. బాల్యవివాహం జరిగినవారిలో అనుకూలదాంపత్యాలెన్నివున్నాయో లెక్కపెట్టు. ప్రేమరహితులై యెంతమంది అకాలమృత్యువాతబడుచున్నారో యెంతమంది ఆత్మహత్య చేసుకుంటున్నారో మనము చూడడంలేదా? వినడంలేదా?

ఈశ్వ—కాలము తీరిపోయాక ఒకరికిమాత్రం జీవించడం సాధ్యమా?

కిషో—కాలము తీరిపొయ్యేదెప్పటికి. ప్రతిమానవుడికీ కూడా బాల్య యౌవ్వన కౌమార వార్ధక్య దశలు నాల్గుగదా. అలాంటప్పుడు యవ్వనదశలోనే కాలం తీరి పోవడమా. కాదు. ప్రేమరహితమైన దాంపత్యాలవడంచేత దుర్వ్యసనాలపాలై వ్యాధిగ్రస్తులై మృత్యుముఖాన్న పడుతున్నారు. ప్రేమ రహితమై అనుకూల దాంపత్యం కాకపోవడంచేత అనేక బాధలకు లోనై ఆత్మహత్య చేసుకుంటున్నారు.

ఈశ్వ— అబ్బబ్బ, వినలేక చచ్చిపోతున్నాను. యేబాధనైనా భరించగలంకాని యీబాధభరించడం కష్టం. అందువల్లనే యెనిమిదేండ్లకే బాలికకు వివాహం చెయ్యాలని శాస్త్రకారుడు వ్రాసివుంటాడు. పాపం యెంతబాధ ననుభవించి వ్రాశాడో ఆయుకర్త.

కిషో—ఆకాలానికీ యీ కాలానికి నక్కకీ నాగలోకానికీ వున్నంత తేడావుంది. అది అమాయక ప్రపంచం. యెనిమిదేండ్లబుడతకు ముప్పదియేండ్లవరుణ్ణి వివాహం చేశారూఅంటే, ఆరోగ్యం చెడకుండా భార్యపుష్పవతి అయేవరకూ నిరీక్షించే వాళ్లు. వృద్ధాప్యం యెలాంటిదో యెరక్కుండా, నూరు సంవత్సరాలూ బలవంతులై సంచరించేవాళ్లు. యిప్పుడో ముప్పదియేండ్లకే వృద్ధాప్యంఆవేసిస్తోంది. కారణం? ప్రేమలేనియీబాల్యవివాహాలే తమకూతులను వృద్ధులకు విక్రయించి సుఖం సూన్యం చెయ్యడం కాకుండా చేసేత వైధవ్యం సంపాదించిపెట్టడం అలావుంచు, పురుషుడుకి పద్దెనిమిది సంవత్సరాలకే యవ్వనం అంకురిస్తోంది. ఆ వయస్సులో వివాహం చేసినా భార్య అవ్యక్తురాలవడం చేత దుర్వ్యసనా లవలంబిస్తున్నాడు. భార్య కాపురానికి వచ్చేసరికి వృద్ధాప్యాన్ని ఆహ్వానిస్తున్నాడు. ప్రపంచం యింత తారుమారయినప్పుడు శాస్త్రకారుని వ్రాతలు యెందుకు ఉపకరిస్తాయి?

ఈశ్వ—అమ్మాయీ! యిన్ని తర్కాలెందుకు నామాట విను. నా యీ వొక్కముద్దు చెల్లించు.

మ॥ చిరుప్రాయంబున నీదుతల్లి దివికిన్ ♦ వేంచేయగా నయ్యె దు
ర్భర దుఃఖానల దగ్ధునయ్యు, నిక నా ♦ ప్రాణంబ నీవంచు ని
ద్ధర జీవించితి నిన్ను బెంచి కనురె♦ప్పన్ బోలె కాపాడితిన్
కరుణన్ జూపవె కన్నతల్లి యొక కో♦ర్కెన్ దీర్చి నీతండ్రికిన్.

అమ్మా కతోర్న్న వివాహం చేసుకో. నన్ను దుఃఖపెట్టకు.

కిషో—తండ్రీ ఉపన్యాసవేదిక నెక్కావు. అగ్రాసనాధిపత్యం వహించావు. నిర్మలమైన ప్రేమకు ప్రాధాన్యం యిచ్చి వివాహాలు చెయ్యాలని తీర్మానించావు. నేడు నీ స్వవిషయంలో నీ కుమార్తెకు వివాహ విషయంలో ఆ తీర్మానాన్ని రద్దుపరుస్తున్నావు. యిది కీర్తికి భంగకరం కాదా? బాల్యన్నుంచీ ప్రాణపదంగా పెంచానన్నావు. ప్రేమపూరిత హృదయంతో కనురెప్పవలె కాపాడానన్నావు. యిప్పుడా ప్రేమ అంతా సూన్యం చేసుకొని నా నూరేండ్ల జీవితాన్ని నీకు బలియియ్య మంటున్నావు. ఆనందమయ జీవితాన్ని దుఃఖభాజనం చేసుకో మంటున్నావు. యిది నీకు ధర్మమేనా? అదిగాక

చ॥ అధునిక సాంప్రదాయమున ♦ కంజను వేయగనేల, విద్య ని
ట్లధికముగాగ గూర్చి నవ ♦ యవ్వన ప్రాయము వచ్చునంతకున్
విధికృతమంచు పెండ్లి తల ♦ పెట్టక నేడిటు లేల నీ "మనో
వ్యధ" జననాడె గొంతు మొద ♦ లంటను గోసిన "గల్గనేర్చునే".

ఈశ్వ—గొంతు కోయడమేమిటి? నీ పరిస్థితి యిలా మారుతుందని తలచినట్లుంటే ముందే వివాహం చేసివుండేవాణ్ణి. కన్న ప్రేమ చేత, పెంచిన మమకారంచేత ఒక్కతెవే కూతురు వవడం చేత నా పంచప్రాణాలు నీ మీద పెట్టుకొని జీవిస్తూ వుండడం చేత, నీ స్వేచ్ఛకు భంగం కలిగించ లేక పోయినాను. నీవు కోరింది కాదనలేక పోయినాను. యిప్పుడు విచారిస్తున్నాను.

కిషో—తండ్రీ! కన్నతలిదండ్రులైనా, గరళాన్ని అమృతమని నోట పోస్తే, పిల్లలు తాగుతారా?

ఈశ్వ—విషంపెట్టడమా? యెంతమాటన్నావు? నీ మేనబావను వివాహంచేసుకోమన్నాను, యిదేనా నాదోషం.

కిషో—తండ్రీ! యింకొకమాట. బావను వివాహంచేసుకోడం మంచిదేనా?

ఈశ్వ—మేనత్తకుమారుడు, తప్పేముంది.

కిషో—నీసోదరీ నీవూ ఒకేతల్లిరక్తం పంచుకున్నారు కదా?

ఈశ్వ—అవును.

కిషో—ఆ దేరక్తం నాలోను, బావలోనూకూడా ప్రవహించడంలేదా? యిదెక్కడ వావి?

ఈశ్వ—నిరాకరించడానికి యెన్నో ఉపమానాలు దొరుకుతాయి కాని, కిషోరీ తుదివాక్యం విని బాగా యోజించుకో.

మ॥ అనురాగంబున, సామవాక్యముల నిన్నర్థింతు నీ పెండ్లికిన్
వనుకూలింపుము, కోరుమేదయిన నీ కర్పింతు, కాకున్నచో
నినుబల్మిన్ ముడిబెట్టి తీరుదు నిదే నిక్కంబు, నన్నెవ్వరిం
దున వారింపగజాలరో తనయ యేదో యింక యోజింపుమా॥

కిషో—యింక యోజించేదేముంది, నీదృఢనిశ్చయం నీవు చెప్పావు నా మనస్సుకు నేనీ వరకే నిశ్చయించుకున్నాను.

ఈశ్వ—యేమని?

కిషో—తండ్రీ,

మ॥నిను ప్రార్థించియు కాళ్లపై బడియు వ్యాసన్నీ రేజముల్ జొచ్చునా
తని పెండ్లాడెద బ్రహ్మచర్యమిల తద్ధ్యంబట్లుకాకున్నచో
నని నేమున్నె తలంచియుంటి, నీవు సన్న్యాయంబుగానన్ను నా
తనికిన్ గట్టిన జచ్చి స్వర్గమున బొందన్ జూతు సత్సౌఖ్యముల్॥

ఈశ్వ—అబ్బబ్బ యెంత బాధిస్తున్నావే. నన్నెంత దుఃఖపెడుతున్నావే. ఛీ యిక నిన్ను పేక్షించ కూడదు. (అంటూ కత్తి తెచ్చి) యిప్పుడు చెప్పు నామాట వింటావా వినవా?

కిషో—తండ్రీ! కత్తిచూచి బెదరడానికి పసిపాపనా ?

ఈశ్వ—యేమిా భయమేలేదా ? (అని పళ్ళుకొరుకుతూ) యేదీ చెప్పు. (అంటూ కత్తినెత్తి కొట్టబోతాడు.)

కిషో—తండ్రీ! నన్ను కొడతావా (అంటూతండ్రి ముఖంలోకి జాలిగా చూస్తూ) నీహృదయంలో జాలిలేదా? (అనికన్నీరుపెడుతుంది)

ఈశ్వ—(కత్తిపారేసి కుమార్తెశిరము నిమురుతు కన్నీరుపెట్టి) అమ్మా నిన్నుకొట్టడానకి నాచేతులువస్తాయా. తల్లీ! కోపంతో అంధుణ్ణయి కత్తిచేపట్టాను. అమ్మా!

దు॥ నను నేడ్పింపగనేల, ముద్దు తనయా ♦ నావంక నీక్షింపః
గనజాలన్ కనుచెమ్మగిల్ల నగవున్ ♦ కాక్షింతునే కాని, నా
మనవిన్ చేకొనుమమ్మ, వృద్ధుడను సన్యాసింపగా దగ్గవా
డను, దండ్రిన్, భువినెన్నినాళ్లొ మనియుండన్ బోను నాతల్లిరో॥

(లోపల కిషోర్ కిషోరీ అని కేక)

కిషో—(అటుచూచి) యెవరు! సరోజా?

సరోజ్—(Yes) యస్.

కిషో—(Come in) కం. ఇన్.

ఈశ్వ—చిట్టితల్లీ! నేను పోతాను. మారాముపెట్టకు. నీస్నేహితురాలితో మాట్లాడు. (అని నిష్క్రమిస్తాడు. సరోజ్ ప్రవేసిస్తుంది)

కిషో—యెంతసేపైంది సరోజా ?

సరో—యిప్పుడే వచ్చాను. మిా బ్రదరేది ?

కిషో—బజారుపోయాడేమో ?

సరో—అబ్బ ! అంతానీపోలికేనోయ్.

కిషో—మాపినతల్లికొడుకేగా ! రా కూచో. (యిద్దరు సోఫాలో కూచుంటారు)

సరో—తప్పకుండారమ్మని చెప్పావుకేటే ?

కిషో—అవును. నీవు నాకో ఉపకారంచెయ్యాలి సరోజా.

సరో—యేమిటో చెప్పు. చేతనైతే తప్పకుండా చేస్తాను.

కిషో—నీవు చేయగలవనే నాధైర్యం. స్నేహంలో ప్రాణంకూడా విడవడానికి వెనుతియ్యవని నానమ్మకం.

సరో—(Oh yes) ఓ యస్.

కిషో—నాకోసం ఒక సజ్జనుడికి ఉపకారంచెయ్యడానికి కొన్నాళ్లుకష్ట పడాలి.

సరో—తప్పకుండా.

కిషో—అయితే నా బెడ్ రూంలోకిపోయి మాట్లాడుకుందాం రా.

(అనిపోతారు తెరపడుతుంది)



# ఆరవ రంగము.



స్థలం—రాజమార్గము.

సమయం—షుమారు సాయంకాలం నాలుగున్నర.

ప్రవేశము—లూజ్ షరాయి పొడుగాటి లాల్చితో మోహన్ దాసు. ఒళ్ళకచ్చ బెంగాలీకట్టు, కోటు, తలపైని టోపీ పెట్టుకొని రామచందర్.

మోహన్—రాంఛందర్! యిక నా జీవితం వ్యర్థం.

రాంఛ—అలా అనకు మోహన్. ఓర్పు ప్రతి మానవుడుకీ అవసరం.

మోహన్—యెక్కడ ఓర్పు. అపవాదం మోపితే భరించాను. యెన్ని దూషించినా హర్షించాను. యేనాటి చౌర్యం యీ నాడు (Arrest) అరెస్టు. యిది భరించడం కష్టం. ఈశ్వర్లాల్ నీ వింత కింత అనుభవించి తీరుతావు. నీ దౌష్ట్యానికి ప్రాయశ్చిత్తం కలిగి తీరుతుంది నీ హృదయంలో పాపభీతికి తావు లేదు. నీ పాపం నిన్ను భస్మంచేస్తుంది. కిషోరీ! యెంతో ప్రేమ చూపావు. నన్ను వివాహం చేసుకోకపోతే బ్రహ్మచర్యం అవలంబిస్తా నన్నావు. కాని, నీ తండ్రిచేసే అక్రమాన్ని వారించలేక పోయావు. యింక నీ ప్రేమ యెందుకు?

రాంభ—మోహన్ ! పాపం కిషోరి యేం చేస్తుంది? నిన్ను విడుదల చేయించమని నాకు వుత్తరంరాసి పంపింది. అంతవరకూ యీ పరిస్థితి నాకు తెలీదు.

మోహన్—యిది నిజమా ?

రాంభ—యిదిగో యీ వుత్తరమే ఋజువు చేస్తుంది. (అని యిస్తాడు)

మోహన్—(చదువుకొని చూచి హృదయానికి హత్తుకొని) కిషోరీ! నేను పొరబడ్డాను. నన్ను క్షమించు. నీవు ప్రేమస్వరూపిణివి. నా అదృష్ట దేవతవు. నీతండ్రి చేసే అక్రమాలకు నీ వెంత దుఃఖించావో నీ వుత్తరమే చెపుతోంది. కాని, నేను కఠినాత్ముడను. నీ ప్రేమను సార్థకం చెయ్యలేని స్థితిలో వున్నాను. దొంగ ననిపించుకొని, ఒకరోజైనా కారాగృహంలో నివసించి రోషాన్ని చంపుకొని యిలా బ్రతికి వున్నాను. నావల్ల నీకేమిసుఖం కలుగుతుంది. నీకోర్కెలు వ్యర్థం. రాంభందర్.

మ॥ ధనసాహాయ్య మొనర్చిపోృచితివి, నిర్దాక్షిణ్యతన్ బైటగెం
టిననా డీశ్వరు డిష్టో "ఖైదు" నను బెట్టించంగ రక్షించినా
వనఘా ప్రాణములైన నిచ్చెదవు నీవౌ, బంధుకోట్లెటికో
తిన, గాకుండిన, నొక్క నీసదృశు మైత్రిన్ బొందినన్ జాలదే.

నీఉపకారబుద్ధికి నాఅభివాదం. నీసన్మైత్రికి నాధన్యవాదం. నాకొనర్చిన మేలుకు నానమస్కారం. యింతకన్న నే నేప్రత్యుపకారంచేయ్యలేను. నాకనుజ్ఞఇయ్యి. అభిమానం నన్ను మెడపట్టిగెంటుతోంది.

రాంభ—మోహన్ నీవుఇంతబేలవా? అపవాదులు కష్టాలూ మానవులకురాక యింకెవరికి సంభవిస్తాయి ? ఐనా

మ॥ ఇలదుర్వాదములెన్నొ మోసి యిక నెన్నే దుర్గతుల్ బొందియున్
చలమూనన్ దగదెన్నినాళ్లకయినన్ సత్యంబెరాణించెడిన్
జ్వలదగ్నిన్ బడివన్నెలన్ దొలగి సిగ్గు తుల్యమౌ సుత్తెదె
బ్బలనెన్నో తిని శోభగాంచదె తుదిన్ బంగారు బల్కాంతితోన్॥

మోహన్—రామూ! నన్నో దార్చడానికి యిలా చెపుతున్నావు కాని రేపు యీ కేసు పర్యవసానం యెలా అవుతుందో చెప్పగలవా ?

రాంభ—ధర్మమే జయం.

మోహన్—యిక్ష్వాకుల వంశం నా వాక్యాలు చెపుతున్నావు యీ కాలంలో న్యాయానికిస్థానముందా?

శా॥ చేయున్ చౌర్య మొకండు, సిక్షనవనిన్ ♦ జొరంగ వేరొక్కడా
గోయున్ గొంతునొకం డిక్కొక్కడురికిన్ ♦ ఘోషింపనా కాని యే
న్యాయంబున్నది ధాత్రి నాగతియు న♦న్యాయంబెయూ నిక్కమీ
న్యాయస్థానములందు న్యాయమగునా ♦ యన్యాయమే న్యాయమా.

కూటసాక్ష్యమైనా సరే. సాక్షిబలాన్ననుసరించి న్యాయాన్యాయ విచక్షణ జరిగేస్థలంలో న్యాయం కలుగుతుందా?

రాంభ—మోహన్ ఆ బాధ్యత అంతా నాది, దానికై విచారించకు.

మోహన్—ఈశ్వర్లాలు కెప్పటికైనా ప్రతీకారం జరిగి తీరుతుంది. (ప్రక్కకు జూచి) ఆవొచ్చేది కఠోర్చందు కాదూ? యీకథకు మూలం యీ తుచ్ఛుడు. (పండ్లు కొరుకుతూ) వీడి గొంతును నులిమితే నాకసి తీరుతుంది.

రాంభ—మోహన్ నీవు యింటికిపోయి స్నానంచేసి బట్టలు వేసుకో. నేను యితని లోతుపాతులు కొంచం విచారించి వొస్తాను. త్వరగా వెళ్ళు.

మోహన్—నీ ఆజ్ఞ జవదాటను. (అంటూ నిష్క్రమిస్తాడు. కఠోర్చందు మోహన్ దాసుని చూస్తూ ప్రవేశిస్తాడు. )

రాంభ—(Hello) హెల్లో! కఠోర్చందు యెక్కడికీ ప్రయాణం?

కఠో—యెక్కడికీ లేదుకాని వీణ్ణి మా మామ జెయిల్లో పెట్టించాట్టగా.

రాంభ—యెవరో జామీను మీాద విడిపించారట.

కఠో—వీడికి జామీా నిచ్చిం దెవరబ్బ.

రాంభ—యెవరోకాని యిప్పుడు నీ వెక్కడికి ?

కరో—నీకోసమే బయుద్దేరాను. నీతో కొంచం పనికలిగింది.

రాంఛ—యేమిటది?

కరో—కొంచం డబ్బవసర మొచ్చింది. మళ్ళీ త్వరలోనే సర్దుతాను.

రాంఛ—అంత అత్యవసరం?

కరో—అవసరమే లేకపోతే నిన్నెందుకడుగుతాను?

రాంఛ—యేవిషయంలోనా అని!

కరో—(present situation) ప్రిజంటు సిట్యుయేషన్‌లో అదిలేక పోతే సుఖం సూన్యమౌతుంది.

రాంఛ—కరోర్. ఈవిషయం నీతో సంప్రదించాలని యెన్నిదినా లనుంచో అనుకుంటున్నాను. కాని సందర్భపడటంలేదు.

కరో—అదేమిటో చెప్పు.

రాంఛ—నీకునామీాద ఆగ్రహం కలుగుతుందే మో?

కరో—యిప్పుడు నీమీాదమాత్రం ఆగ్రహం కలగదు.

రాంఛ—నీవు యీా తుచ్ఛభోగాల నభిలషించడం యెందుకు?

కరో—యిదేమిటి. తుచ్ఛభోగాలేమిటి?

రాంఛ—తాగుడు, వ్యభిచారం, దుర్వ్యసనాలు కావా యివి?

కరో—(నవ్వి) హ హ హ హ. రాంఛందర్! యెంత తెలివితక్కువ గా అన్నావు. అవ్వి దుర్వ్యసనాలని నువ్వు ఒక్కడివన్నావు. అందులో యెంతమజావున్నది. యెంత (Happiness) హ్యాపీ నెస్ వున్నది. నీవెప్పుడు ఆరుచి యెరుగవు గనుక అలా అంటున్నావు గాని.

మ॥ అమితోల్లాసమొసంగు దేహమున క ♦ త్యారోగ్యమా నెంతో ధై
ర్యముజేకూర్చు మధుద్రవంబికను వే ♦ శ్యాసంగమం బెన్న శ
క్యముకానంతటి సౌఖ్యముల్ బొసగు ను ♦ ర్వ్యామర్త్యలోకాల మ
ధ్యమునన్ మెట్లనుగట్టవచ్చు మిళితం ♦ బై వెల్గ నీ రెంటితోన్॥

రాంఛ—కరోర్ యెంత పొరబడుతున్నావు. యీాసౌఖ్యపర్యవసానం యెరగవు?

మ॥ కలవ్రివ్యంబు హరించు రూపము చెడుఁ • కాయంబు శుష్కించు న
న్యులకుఁ జుల్కనగొల్పు వంచనము జే•యుఁ బిచ్చి యెత్తించు వ్యా
ధులకుఁ స్థావరముబ్బు బిక్షుకులపా•ల్తుఁ జేర్చుచుఁ మృత్యుకో
రలఁ కందించును మేళవింప గణికా • ప్రాంది మహామారులఁ.

కతో—యిదిగో నీవు నాటిని అనవసరంగా దూషిస్తున్నావు అందులో నొకటి నీకుగూడా అనుభవనమే? యిది కేవలం నా(Enjoyment)ఎంజాయ్ మెంటు చూడలేక.........

రాంభ—కాదు నీదుస్థితి చూడలేక. నాఅనుభవం అనుకూలదాంపత్యాతుల్యంగా జరుగుతోంది. మధురబాల ప్రేమోపాసన చేస్తోంది బఁసారి ధనోపాసన చేస్తోంది. యిది మన యిర్వురిలో గల తారతమ్యం.

కతో—అని నీవనుకుంటున్నావు. బఁసారికి నామీద యెంతప్రేమ వుందో నీకెలా తెలుస్తుంది?

రాంభ—కనిపిస్తూనేవుంది, రిక్తహస్తాలతో వెళ్ళినప్పుడల్లా పూర్తిగా ప్రేమ వెల్లివిరుస్తూ వుంటుంది.

కతో—మా సరాగాలు నీకర్థం కావు గాని నిన్నడిగింది యిష్టముంటే యిస్తానని చెప్పు. లేకపోతే ఇవ్వనని చెప్పు.

రాంభ—ప్రస్తుతం నాదగ్గరలేదు.

కతో—అలా కాదు. ఇవ్వనని చెప్పు (Plain) ప్లెయిఁ గా.

రాంభ—ఇవ్వను. యేంచేస్తావు?

కతో—యేంచేస్తానా? (అంటూ పళ్ళుకొరుకుతూ చూచుకుంటూ పోతాడు)

రాంభ—తుచ్ఛుడా! కండ్లుపొరలు గమ్మివున్నాయి. మంచిమాటలు యిప్పుడు చెవులనాటుతాయా? (అంటూ నిష్క్రమిస్తాడు.)



# ఏడవ రంగము.



స్థలం: బల్ సారి గృహం. గంగు నిలబడి వుంటుంది. బల్ సారి సోఫాలో కూచుని వుంటుంది. గంగు చెవులను వెంట్రుకలు కప్పివుండేటట్టుగా కొప్పు పెడుతుంది. ముక్కుపోగు పెడుతుంది. లేతవయస్సు. అక్కడక్కడా చిరిగిన తెల్లచీర కడుతుంది.ఒక సోఫా, రెండు కుర్చీలూ, ఒకరౌండు టేబిల్ వుంటాయి.

గంగు—మా యాయనసచ్చిపోయిండమ్మగోరూ.

బల్ సా—పాపం. మరియెలాజీవిస్తున్నావు?

గంగు—మాబాబూవోళ్ళూ యాడన్నా కామడతారేమో అనిశానా లెతికాను. యాడాకామడనేదు. వోయింటికాడ కొన్నాలు శాకిరిసేత్తేబువ్వెట్టారు, ఆరింటికాడ నాకేమీబాగుండనేదు. అందుకని యిలావొచ్చాను.

బల్ సా—నీవు నమ్మకంగావుంటే నీకేమీలోటుచెయ్యను. కార్య దీక్షలో ధైర్యసాహసాలవసరం. యెట్టివిషయమైనా హృద యంలో గుప్తపర్చాలి.

గంగు—చరేనుండి అమ్మగోరూ? మీరేసూత్తారుగా, ఇప్పుడెందుకు.

బల్ సా—నీ చక్కదనానికి, యీముక్కుపోగూ ఆకొప్పు, ఏమీ బాగుండలేదు. నీవేషభాషలు కొంచం మార్చుకోవాలి. లేక పోతే వ్యవహారాలు సాగవు.

గంగు—కొన్నాలు జరగనీండి అమ్మగోరూ. కమంగా అన్నీమార్చు కుంటాను.

(అంత మధురబాల ప్రవేశించి చూస్తుంది)

మధు—అక్కా యీపిల్లయెవరు ?

బల్ సా—తూర్పుదేశమట, యెవరూలేరు. పనికుంటాననివొచ్చింది.

మధు—ఉంచావా ?

బల్ సా—ఆ.

మధు—దురలవాట్లు మాత్రం చెయ్యకు. రత్నంలాంటి పిల్ల.

బగ్సా—నిన్నెవరూ సలహా అడగలేదు.

మధు—అంతకోపమెందుకే అక్కా? (అంటూ గంగువంక చూస్తుంది. గంగు కొంచం నవ్వు వొచ్చి చెయ్యి అడ్డుపెట్టుకుంది)

బగ్సా—సందర్భాను సారంగా సంచరించాలి.

మధు—నాకు తెలీకపోతే చెప్పకూడదుటే అక్కా. అందుకు కోప్పడాలా.

బగ్సా—తెలీదూ పాపం. ఉపన్యాసాలివ్వడం తెలుసూ?

మధు—దానికేం యెవరైనా చెబితే నేర్చుకుని ఆ రెండు ముక్కలు అక్కడ వెళ్లబెట్టి వస్తాను.

బగ్సా—అంతకన్న యెక్కువ తెలివితేటలేలావొస్తాయీ?

మధు—నీచెల్లిని కాదుటే అక్కా. గంగూ కాసేపు నాగదిలోకూచొని వొద్దాం రా!

గంగు—అమ్మగోరూ! పొమ్మంటారా?

బగ్సా—యిప్పుడు కొంచం పనివుంది.

మధు—పోనీలే (అంటూ లోపలకు పోతుంది)

బగ్సా—గంగూ!

గంగు—అమ్మా

బగ్సా—నాకు తెలీకుండా నీ వెక్కడికీ పోకూడదు. తెలిసిందా?

గంగు—అలాగేనమ్మా!

(కిశోర్ విలాసపురుషుడిలాగ ఉచితమైన వేషముతో ప్రవేశించి గంగును చూచి)

కిశో—(Hello darling) హెలో డార్లింగ్. యీపిల్ల యెవరు?

బగ్సా—ఏమైంది?

కిశో—(Simply) సింప్లి. అదికూడా తప్పేనా?

బగ్సా—కాకపోతే నీకేమి టవసరం? నాయింట్లో యితర్లెందుకుంటారు?

కరో—పొరపాటు.

బక్సా—పొరపాటు. (అంటూ పెడమొగం పెడుతుంది)

కరో—(Simple things) సింపుల్ థింగ్సుకు కూడా ఆగ్రహమే?

బక్సా—నీ అసమర్థతకు ఆగ్రహపడక ఏంచెయ్యాలి?

కరో—ఏమైంది.

బక్సా—యేమౌతుందో నేను చెప్పలేదూ? ఇన్ని దినాలనుంచీ (Keys) కీస్ (Handover) హ్యాండోవర్ చేసికోగల్గావూ?

కరో—అదా సంగతి. దేనికైనా సమయంరావాలి (Wait for the time) వెయిట్ ఫర్ ది టైం అన్నారు. (Only few days) ఓన్లీ ఫ్యూ డేస్ (అంటూ చెయ్యి పట్టుకోబోతాడు)

బక్సా—(విదిలించుకొని) యేమిటదీ, సమయా సమయాల్లేవూ?

కరో—సమయంకోసమే నిరీక్షిస్తున్నాను....యితర్లెవరూ లేరుగా?

గంగు—అమ్మా. నేను.........

బక్సా—అక్కర్లేదు వుండు.

కరో—అవతలకు పో.

గంగు—మాఅమ్మగోరి ఆగ్గలేదు.

కరో—(What is this) హ్వాట్ ఈజ్ దిస్? (అంటూ బక్సారి వంక చూస్తాడు.)

బక్సా—యేముంది?

కరో—ని అభిప్రాయం నాకు బోధపడడం లేదు.

బక్సా—నీ అభిప్రాయం నాకంతకన్న బోధపడడం లేదు.

కరో—ఇంత (Strict) స్ట్రిక్టు అయితే బ్రతకడం కష్టం.

బక్సా—ఇంత జాగైనా బ్రతకడం కష్టమే.

కరో—రామూ! నీవుచెప్పింది సత్యం. నీమీద అనవసరంగా ఆగ్రహించాను.

బస్సా—యేమిటా చెప్పింది?

కిశో—యేం చెప్పాలి. యేం చెపితే నేం.

బస్సా—గంగూ! ఆ సీసా, గ్లాసులు తెచ్చిపెట్టు.

గంగు—సిత్తం (అంటూ నిష్క్రమిస్తుంది)

బస్సా—రహశ్యమైతే నాకు చెప్పనక్కర్లేదులే— —

కిశో—సహజమైన సంగతే!

బస్సా—సరాగాలు కూడా విరాగాలుగా పరిణమిస్తూంటే!

(గంగు సీసా గ్లాసులూ తెచ్చి బల్లమీద పెడతుంది)

కిశో—యిది సరాగమని యెవరంటారూ?

బస్సా—గంగూ! గ్లాసులో పొయ్యి, యీపిల్ల యెవరన్న మాట మీాద నేగా యీ గొడవ?

కిశో—అవును. యెందుకు చెప్పలేదు?

బస్సా—(కిశోర్ని చెయ్యిపట్టి సోఫామీదకు తీసుకొనిపోయి) గంగూ! గ్లాసు తెచ్చి ఇయ్యి. చూస్తూంటే యెవరైందీ అర్థంకాదూ?

కిశో—(గ్లాసుతీసుకొంటూ) యిప్పుడర్థమైంది. సరాగాల్లోకూడా భావం ఇమిడివుంటుందని యెవరనుకుంటారు?

బస్సా—భావంలేని విషయమేముంది? (అంటూ చేతిలోగ్లాసు తీసుకొని నోటి కందిస్తుంది. (కిశోర్ తాగుతాడు) గంగూ! యింకోగ్లాసు.

గంగు—యిదో అమ్మా (అనిబస్సారి కందిస్తుంది.)

బస్సా—(చేతిలో పట్టుకొని) రాము యేం చెప్పాడు?

కిశో—వాడిపిండాకుడు. వాడో (brute) బ్రూట్.

బస్సా—(కొంచం తాగించి) నాకు చెప్పకూడదా?

కిశో—యేముంది చెప్పేందుకు. నాదగ్గరకూడా దుర్వ్యసనాలంటూ (lecture) లెక్చర్ మొదలెట్టాడు.

బస్సా—(తలవూపుతూ) కానియ్యి (అని సొంతంతాగిస్తుంది.)

కరో—యీూ (Happiness) హ్యాపీనెస్ వాడి కేమర్థమౌతుంది? యిప్పుడు స్వర్గంఅవుపిస్తోంది. (beloved one more glass) బిలౌడ్ వన్ మోర్ గ్లాస్, (గంగుయింకో గ్లాసు పోసియివ్వగా అదికూడా త్రాగుతాడు) యిప్పుడు (temperature) టెంప రేచర్ బాగా (Rise) రైజ్ అవుతోంది. (My queen) మై క్వీన్ నువ్వుకూడా పుచ్చుకోవేం? ఇదుగో ట్రాగు (enjoy) ఎంజాయ్. (అంటూ నోటిదగ్గర పెడతాడు.)

బన్సా—అబ్బా! నాకిప్పుడు మనసు బాగాలేదు.

కరో—ఇది మనషు బాగుచేస్తుంది. టీసుకో.

బన్సా—వొద్దంటూంటే (అని చెయ్యితోస్తుంది.)

కరో—నొడ్డకపోటే నేనే ట్రాగుటాను, (త్రాగి) హ హ హ హ హ (Beauty) బ్యూటీ, హ హ హ దేవటలు అమృటం ట్రాగిండి అబడ్డం. నేను బ్రాండీట్రాగిండి నిజం. (brandy is only the god) బ్రాందీ ఈస్ ఓన్లీ ది గాడ్. హ హ హ (fools) ఫూల్సు. దేము డెక్కడున్నాడు?(Iam the god) ఐ యాం ది గాడ్. (అంటూ లేచి సీసాచేతపుచ్చుకుని) ఇడే అమృటం. డేవటను గనక ట్రాగుటాను. (అని త్రాగి తూలుతూ సోఫాలో చతికిలబడి) బన్సారీ (you are the beauty) యు ఆర్ ది బ్యూటీ. నీవేబ్రాండీ. నిన్ను ట్రాగుటే హ హ హ హ హ (my love) మై లవ్. (Come on) కం ఆన్. (అంటూ సోఫాలో స్మృతితప్పి పడుకుంటాడు)

బన్సా—(కొద్దిగా నవ్వి) అంధుడు.

(తలుపు చప్పుడౌతుంది)

బన్సా—గంగూ యితనులేస్తే గ్లాసు చేతికియ్యి. (అంటూ పోయి తలుపుతీస్తుంది. సబ్ ఇనస్పెక్టర్ ప్రవేశిస్తాడు)

బన్సా—(good night sir) గుడ్ నైట్ సర్.

సబు—త్వరగా పోవాలి (అంటూ చెయ్యిపట్టుకొని లోపలికి తీసుకు పోతాడు)

గంగు—సబుఇనస్పెక్టరు. (అని తెల్లబోయి విచారం సూచిస్తుంది)

కిశో—(లేవకయే My heart) మై హార్టు. (అనిచెయ్యెనెత్తుతాడు)

(గంగు గ్లాసు నందిస్తూ వుంటుంది. తెర పడుతుంది)



## ఎనిమిదవ రంగం



స్థలం: మైదాన సమీపంలో కోటుతొడుక్కొని రాంచందర్ మధురబాల సన్నలేతగులాబి సిల్కుచీరపైని పెద్దపూలు అతుకువుంటాయి. దానిమాదిరి సరిపడ్డ జాకెట్ లేడీషూతొడిగి ప్రవేశిస్తారు.

మధు—రామూ! మళ్లీయెప్పుడొస్తావో, నాకు క్షణమొక యుగంలా వుంటుంది.

రాంచం—(two days) టూ డేస్. అంతకన్న యెక్కువ పట్టదు.

(అంతముకుందలాల్ పూర్వవేషంతో ప్రవేశిస్తాడు)

రాంచం—(Hello) హెల్లో ముకుందు! బహుకాలదర్శనం.

ముకుం—(షేక్ హ్యాండు యిచ్చి) యీమధ్య గ్రామంలో లేను.

మధు—మీ (Sister) సిష్టర్ కులాసా ?

ముకుం—మా (Sister) సిష్టర్ సంగతి నాకే అర్థంకాకుండావుంది.

మధు—యేమీ ?

ముకుం—యెప్పుడూ యేదో ఆలోచిస్తూ వుంటుంది. యెవరికీ చెప్పదు. శరీరంలో అస్వస్థత యేమీ కనుపించదు. నీరసంగా వుంటుంది. యేదైనా కార్యదీక్షలో వుందేమో ననుకుంటున్నాను.

రాంచం—కిషోరిది చాలాగంభీర హృదయం.

మధు—బహుశా వాళ్లయింట్లో జరిగిన చౌర్యాన్ని గురించే అనుకుంటాను.

ముకుం—అయితే కావచ్చును నాకోసం యెదురుచూస్తూ వుంటుంది పోతాను.

(అంటూ నిష్క్రమిస్తాడు)

మధు—యేదోపని మీద పంపినట్టుంది.

రాంభం—అవును. మోహన్‌దాసుమీద అపవాదు తొలిగించాలని ఆమెదీక్ష.

మధు—(ప్రైడువంకచూచి) ఆ జన మేమిటి ?

రాంభం—అది (liquor shop) లిక్కర్ షాప్.

మధు—ఆహా పానకంమీద యీగలుమూగినట్లు యేమి వీరిగుడ్డి తనం. చేసేన దేశానికి దారిద్ర్యం తెచ్చి పెడుతున్నారు. అంత తీపి...

రాంభం—తీపి. యెక్కడతీపి ?

ఉ. నాలుక చేదుబుట్ట గళనాళము భగ్గునమండ "దాగుచో"
సోలు శరీరముల్ కనులు జ్యోతులగున్, శిరమింత తిప్పు, రా
గాలును వాగుడుల్ పెరుగు, గంతులునేర్పును, దెబ్బలాటలో
గాలిడ బంపు, బాదనుస గాపడి పొర్లగజేయు "బ్రాందియే".

మధు:—తమ కన్నులతో తాగినవారి యవస్థలు కన్నులారచూస్తూ ఆ తాగుడే ఆసిస్తున్నారు అంటే, వీరి నేను నాలో తోచడం లేదు. పశుతుల్యులుగా గణించడానికి కూడా అర్హులుకారు. పశువులుకూడా దప్పితీర్చుకోడానికి కుడితినీళ్లు తాగుతాయి కాని కల్లుసారాలు తాగవు. ఒకపశువులేకాదు పిపీలికాది బ్రహ్మపర్యంతంగల జీవరాసుల్లో యేజీవికూడా యీతాగుడు నభిలషించడంలేదు. దుర్వ్యామోహ పీడితులైన మానవులు బ్రాందీని ప్రాణతుల్యంగాయెంచి పూజిస్తున్నారు యెందుచేత?

రాంభం—మోహాంధులవడంచేత.

మధు—అంతేకాదు. మదాంధులవడంచేత తమకు కలగబోయే దుర్గతులు తెలుసుకోలేకపోవడంచేత (ఆలకించి) ఆశోకాలేమిటి?

రాంభం.—శోకాలుకాదు. (నవ్వి) సంగీతాలు. తాగ్రి, మైకంలో వున్న వాళ్లు ఆ సంగీతంలోవున్న స్వారశ్యాన్ని (easy) ఈజీగా గ్రహించుకోవడమే కాకుండా వంతపాట పాడుతూ బ్రహ్మానందం అనుభవిస్తూంటారు. వినేవాళ్ళకు శోకాలు.

మధు—అదుగో యెవడో నృత్యం చేస్తున్నాడు. వాడు భావప్రకటన చేస్తూ పద్యం పాడుతున్నాడు. నాటకంలో నాయక పాత్రకి తగివున్నాడు. ఆగోల యేమిటి? చోరులు కాబోలు. పంపిణీలో తగాదా పడుచున్నారు.

రాంభం—అదుగో జూదగాండ్రు, పందెము దగ్గర కాబోలు పోట్లాట పడ్డది.

మధు—వారెవరు? ఓటర్ల ప్రచారకులా? రామూ! ప్రతివారికీ యీ తాగ్రుడు జీవనాధారమైంది సుమా!

సీ॥ వేసగాండ్రకునెల్ల ♦ వాసస్థలము బ్రాంది
పాటకులకు గొప్ప ♦ పాట బ్రాంది
మోసంబులకు గొడ్డు ♦ ముక్క-తాడగు బ్రాంది
కయ్యంబులకు సుర ♦ కత్తి బ్రాంది
జారత్వమున కెంతో ♦ సౌఖ్యప్రదము బ్రాంది
జూదంబులకును పు♦నాది బ్రాంది
చౌర్యంబులకు ప్రాణ ♦ సఖుడగు నీ బ్రాంది
హత్యాలయం దంత♦రాత్మ బ్రాంది
గీ॥ ఓట్లవార్జింవ నెంతో చే♦యూత బ్రాంది
పదవులను బొందగా దివ్య ♦ పదము బ్రాంది
యిన్ని యేల దుర్వ్యసనాల ♦ కెల్ల బ్రాంది
యీాలవాలమై కొంపల ♦ నార్చుచుండె॥

యీ బ్రాందీకి వెలయాలికీ (Friendship) ఫ్రెండ్ షిప్ యెక్కువ.

రాంభం—(Friendship) ఫ్రెండ్ షిప్ కాదు. పొరబడుతున్నావు. ఒకటి గరళం. ఒకటి నాభి. రెండు విషాలే.

మధు—గరళం, నాభి, యీ రెండూ ఒకానొకప్పుడు ప్రాణాపాయ సమయంలో ప్రాణాన్ని కాపాడతాయి. కాని, యీ రెండూ ప్రాణాలు తీస్తాయి. యీ బ్రాందీ లేకుండా యేహత్య జరిగింది? వ్యభిచారంవల్ల యెన్ని హత్యలు జరుగుతున్నాయో లెక్క-లేదు. హత్యలకు పుట్టినిల్లు వేశ్య. సహాధ్యాయి బ్రాంది. కాని, రాంమూ! హత్య అనేటప్పటికీ నా కెందుచేతనో భీతి కలుగుతోంది.

రాంఛం—అది అంత భీభత్సమైన శబ్దం.

మధు—నా నోటివెంట నుచ్చరిస్తూ వుంటినిగా.

రాంఛం—అయితే హృదయదౌర్బల్యమే అందుకు కారణం. (అంటూ సైడువంక చూచి) అదిగో గ్లాసులు పగులుతున్నాయి.

మధు:—అయ్యో! పాపం యెవరినో కొడుతున్నారు. గాజుగ్లాసుల తోటే! అదిగో పాపం అతనెవరో—రక్తంకారుతోంది. బైటకు లాగుతున్నారు.

రాంఛం:—అతనే (Shop keeper) షాప్ కీపర్.

మధు:—వీనికీ ప్రాయశ్చిత్తము కాదగ్గదే. ప్రతిదినమూ కోటానుకోట్లు ద్రవ్యమును కొల్ల గొట్టుచు దేశానికి దారిద్ర్యాన్ని చేకూరుస్తూన్న మత్తుపదార్థాలను విక్రయించ పూనడమే కాకుండా కృత్రిమ మధురసాన్ని (prepare) ప్రిపేర్ చేసి యితరపదార్థాలను మేళవించి ద్రవ్యాన్ని దోచుకోవడమే కాదు. ధనలోపమై నగలను తెచ్చి తాగనెంచు వెంగళప్పల తలలకు మసిపూసి యెంతో విలువగల వస్తువులను ఒక దినమో రెండు టిన్నాలో తాగుడుకింద చెల్లించుకొని మోసంచేస్తున్నారు. అన్నవస్త్రాదులకు కరవై యెంతోమంది దుఃఖించడానికి కారణభూతు లౌతున్నారు. యీ తుచ్ఛుల గతి యింతకన్న యెక్కు-వగా యెలావుంటుంది. వీరీ నెత్తురు కూడభిలషించడ మెందుకు? సరిగా పోయలేదని యొకడు తిడు

తూంటే, నిషా తక్కువైనదని యొకడు తాగినది మొగాన నూస్తూంటే, మత్తెక్కి యొకడు తాగిన గ్లాసు విసరి కొడుతూంటే హెచ్చుతగ్గినప్పుడందరూ కలిసి యీ విధంగా శరీరమంతా రక్తప్రవాహం చేస్తుంటే సహిస్తూ యేహ్యంగా జీవించ దలచడంకన్న యింటింటా బిచ్చమెత్తుకొని జీవించడం మేలుకాదా ?

రాంఛం—ధనాశాపిశాచం పట్టి యిలా గడ్డికరుస్తున్నారు. అదిగో! కరోర్చందుకూడా యిక్కడేవున్నట్లుంది.

మధు—యెందుకుండడు. రామూ? యికయెన్నటికైనా ప్రపంచంమీద జూదరులు, మోసగాండ్రు, చోరులు, హంతకులు, జారులు, తాగుబోతులు, చెడపెలు యీదుర్వ్యసనాలుమాని, బ్రహ్మరాక్షసియైన యీ బ్రాంది, పిశాచాలైన వేశ్యలు నసించి భరతమాత, సర్వాలంకార శోభితయై దివ్యజ్యోతియై వెలుగొంద గల్గుతుందా?

రాంఛం—దేశభక్తులింకా ప్రబలి ప్రతి మానవుడూకూడా దుర్వ్యసనాలను నిరసించి ఒకానొకప్పటికైనా భారతమాతకు శోభకలగ జేస్తారనే నా నమ్మకం.

మధు—అలా జరక్కపోతే ప్రపంచంయింకాఅధోగతి పాలై తీరుతుంది. భారతమాత కన్నీటి కాల్వలలో ప్రపంచమంతా మునిగిపోతుంది.

రాంఛం—అంత వరకూ రాదు. భారతసోదరులు నిద్రమేల్కొంటారు. నాకు (Train) ట్రైనుకు టైమౌతోంది. (అంటూయిద్దరూ నిష్క్రమిస్తారు. ఈశ్వర్లాలు ప్రవేసించి చూస్తూ)

ఈశ్వ—ఆ ఘాయ్యేది కిషోరి కాదుగదా? కాదు, యెటుపోయిందో ? అబ్బబ్బ తిరిగి తిరిగి కాళ్లు పడిపోయినాయి. ప్రాణంవేసారింది, యేంచెయ్యను? యేమైనా అంటేయేడుస్తుంది. యేడుస్తూంటే చూడలేను. ఛీ! యీజీవితంమీదనే విరక్తిపుడుతోంది. బలవంతంగా ప్రాణంతీసుకుంటే చాలాబాగుండేట్టుంది.

(కరోర్ చంద్ తూలుతూ ప్రవేసిస్తాడు)

ఈశ్వ—కరోర్ ! కిషోరిజాడ యేమైనా తెలుసా నీకు?

కరో—హ హ హ హ ! ఆసంగతి మోహన్ దాసు నడగాలి.

ఈశ్వ—నీకేమైనా మతిపోయిందా ?

కరో—నాకు పోలేదు.........

ఈశ్వ—ఓరితుచ్ఛుడా! తాగినట్లున్న దే.

కరో—హ హ హ హ మామా! నువ్వు డబ్బీయకపోతే అగుతుందా. (My love) మై లవ్ బన్ సారి యిచ్చింది. (auful) ఆఫుల్ గా తాగేశాను. నీక్కూడా యిప్పిస్తా, కావాలా ?

ఈశ్వ:—కరోర్, నీ వ్యవహారం యింత వరకూ వినడమేకాని కళ్లతో చూడ లేదు. యివ్వాళ ప్రత్యక్షంగా చూశాను. నా గౌరవం యెందుకు ధ్వంసం చేస్తావు. నా మాటవిను. నీనడవడిక దిద్దుకో.

కరో:—ఓయి పిచ్చిమామయ్యా! గౌరవంపోతుందా. క్లబ్బుకుపోదాం రా. మధురసానికెంత గౌరవమున్నదో చూద్దువుగాని. (Natch-party) నాచ్ పార్టీలో బ్రాందీ, హ్విస్కీలు లేందే లబ్జు వుండదు. కిషోరి (Marriage) మ్యారియేజ్ కి జల్సాచేయించు. బన్ సారిచేత (Dance) డ్యాన్సు చేయిస్తాను. అప్పుడక్కడ స్వర్గం కనిపిస్తుంది.

ఈశ్వ—ఏమిటీ వాగుడు ?

కరో—యిది వాగుడు కాదు, వేదవాక్యాలు.

ఈశ్వ—ఛీ అంధుడా. విన్నకొద్దీ యెక్కువౌతోంది. యిక నిన్ను సహించను.

కరో—సహించక యేం చేస్తావు ?

ఈశ్వ—యేం చేస్తానా ? నా యింటికి రానీయను. నా ఆస్తిలో చిల్లి గవ్వైనా నీకు దక్కనీయను. నీకు కూడుగూడా బుట్టనీయను.

కరో—హ హ హ యెంతకాలం ?

ఈశ్వ—యేం ! నన్ను చంపుతావా ?

కరో— నే ననలేదే.

ఈశ్వ—అనలేదు. యెందుకంటావు. నీవు బాగుపడే మార్గం వుంటే సవ్యంగా యింటికి నడువు. నా కూతురూ నా ఆస్తీ కూడా నీకు యిస్తాను. మంచిమార్గం అవలంబించు.

కిశో—(I care a damn for you) ఐ కేర్ ఎ డ్యామ్ ఫర్ యు. నువ్వు యిచ్చేదేమిటి ? నీ యింటికి నేనే యజమానినౌతాను.

ఈశ్వ—నేను బ్రతికివుండగా కాలేవు.

కిశో—చూస్తాను. ( అంటూ నిష్క్రమిస్తాడు. )

ఈశ్వ—దీని దుంప తెగ. ఈ త్రాగుడులోవున్న మహాత్యం యేమిటో యెంతమాటైనా అనిపిస్తుంది. తుచ్ఛుడు చెడిపోయినాడు. యిక వీడిని దారికి తేవడం దుస్సాధ్యం. నాశక్తివంచన లేకుండా ప్రయత్నిస్తాను. (మోహన్‌దాసు ప్రవేశించి ఈశ్వర్లాలును కోరగా చూస్తూ నడుస్తాడు)

ఈశ్వ—యేమా విషపుచూపు.

మోహన్—నా చూపులో విషం లేదు. నీహృదయం విషంతో నిండి వుంది.

ఈశ్వ—ఛీ! నోరుముయ్యి. నీచేతలు సవ్యంగావుంటే బాగుపడే వాడివి. చౌర్యం చెయ్యకపోతే యీ వేషాలెలావొస్తున్నాయి. భోగాలెలా జరుగు తున్నాయి. రాంఛందర్ తోడిదొంగై నిన్ను జెయిల్లోంచి విడిపించాడు. విచారణ పూర్తి కానియ్యి. నీ గతి తెలుస్తుంది.

మోహన్—ఈ తుచ్ఛపాటు నిన్నెన్ని రోజులో బ్రతకనీయదు. లేకపోతే ఇంత అన్యాయానికి తలకొంటావా? రాంఛందర్ తోడి దొంగ అయ్యాడా? నీచుడి దృష్టికి ప్రపంచమంతా నీచంగా కనపడటం సహజం.

ఈశ్వ—నేనా నీచుణ్ణి?

మోహన్—అవును.

ఈశ్వ—నీయోగం బాగున్నట్టు లేదు.

మోహన్—నా యోగం కాదు. నీ యోగ మసలు బాగుండలేదు. నీతో నాకు పనేమిటి. (అంటూ నిష్క్రమిస్తాడు)

ఈశ్వ—(పళ్లు కొరుకుతూ) యవ్వనగర్వం అలా అనిపిస్తోంది. తిరిగి నీకు కారాగృహం తప్పదు. (అని చూస్తూ నిష్క్రమిస్తాడు)

( తెర పడును )



# తొమ్మిదవ రంగము.



స్థలం: (బన్సారి గృహం. బన్సారి ఒంటిగా కూచుంటుంది)

బన్సా:—(యోచిస్తూ)పరిణామం......ఇప్పుడు యోజించ వలసిన అగత్యంలేదు.........సమయం నిరీక్షించాలి....(Wait for the time) వెయిట్ ఫర్ ది టైం అన్న కర్జోర్చందు వాక్యాలు నా కర్ణరంధ్రాల్లో ప్రతిధ్వనిస్తున్నాయి......... నిస్పృహ చెందకూడదు.........బ్రాందీ వజ్రాయుధం..... ఊఁ. ఆయత్తమై వుంటాను. (అని లేవబోయి ఆగి) గంగూ!

గంగు—(ప్రవేశిస్తుంది)

బన్సా—ఏం చేస్తున్నావు?

గంగు—చెండు గుచ్చుతున్నానండి.

బన్సా—అలంకార సామగ్రి తెచ్చి బల్లమీద పెట్టు.

గంగు—సిత్తం (అంటూ నిష్క్రమిస్తుంది.)

బన్సా—నమ్మకస్థురాలు, సమర్థురాలు.

గంగు—(చిన్న బొట్టుపెట్టె తెచ్చి బల్లమీద పెడుతుంది)

బన్సా—గంగూ చెల్లి యేం చేస్తోంది?

గంగు—గదిలో పండుకొని యేందో సదువుకుంటుండట్టుండారు. పిలూమంటారా?

బర్సా—యిప్పుడక్కర్లేదు. (అంటూ బల్లకెదురుగా వున్న కుర్చీలో కూచోని బొట్టు పెట్టెలోవున్న దువ్వెన తీసుకుని తల దువ్వుకుంటుంది. )

బర్సా—చెండు తయారైందా ?

గంగు—సొంతం గుచ్చి తీసుకొత్తాను. (అంటూ వెళుతుంది)

బర్సా—కార్యదీక్ష... హ హ హ. యెవరి కెవరు.........

(ముకుందలాల్ ప్రవేశించి నిలచి చూస్తూంటాడు)

బర్సా—(పౌడరు డబ్బా తీసి అద్దుకుంటూ) లేకున్న ప్రమాదమే (అంటూ పెదవులకూ బుగ్గలకూ రంగద్దుతూ తళుకు చల్లుకుంటుంది)

ముకుం—వేశ్యలకు సౌందర్యము ఆకర్షవంతంగా. రంగులు చిత్రించిన మృణ్మయ విగ్రహం. నాటకంలో కృత్రిమవేషం.

గంగు—(ప్రవేశించి ముకుందుని చూచి చిరునవ్వు సూచించి బర్సారి దగ్గరకుపోయి) అమ్మగోరూ ఇదిగో చెండు. (మెల్లిగా) వోరో వొచ్చిండ్రు.

బర్సా—(నిస్పృహతో) ప్రయత్న భంగమా ? (అంటూ ముకుందు వంక చూచి చెండు పెట్టుకుంటూ ముకుందు వంకకు నడుస్తూంటుంది)

గంగు—(తెల్లబోయి) ప్రయత్న భంగమా ? (అంటూ ఆలోచిస్తూ నిల్చుంటుంది. )

బర్సారి—తమ రేయూరు ?

ముకుం—మాది దూరదేశం.

బర్సా—పని ?

ముకుం—ఈ గృహ మెవ్వరిది ?

బర్సా—కళావంతులది.

ముకుం—యికనేమి ?

బఙ్సా—వ్యాపారమా?

ముకుం—నగల వ్యాపారం.

బఙ్సా—(యోచించి తనలో) మంచిబేరం. ఏమిటి చెయ్యడం?

ముకుం—యోజన యెందుకు? ఇదిగో. (అని ఒకహారం తీసియిస్తాడు)

బఙ్సా—(అందుకుంటూ) కాని, ఈరోజున......

ముకుం—యింకెవరూ లేరూ?

బఙ్సా—(యోజించి తలూపుతూ తనలో) (Trial) ట్రియల్ చూదాం. (ప్రకాశంగా) నాచెల్లి వున్నది. (అంటూ గంగువంక చూచి దగ్గరకు రమ్మని తలూపుతుంది)

గంగు—(దగ్గరకు వచ్చి) ఆగ్గె (అంటూ బఙ్సారి మొగంలోకి చూస్తుంది.)

బఙ్సా—(చిరునవ్వుతో ముకుందువంక చూస్తూ) కొత్త.

ముకుం—యెంతచక్కగావుంది తెలివిగల పిల్ల.

బఙ్సా—చురుకుతనం కూడావుంది. కాని విశేష శ్రమకోర్చలేదు.

ముకుం—బాల్యం, స్నేహానికి తగిన వయస్సు.

బఙ్సా—(గంగుతో మెల్లిగా) గంగూ! వీరిని సంతోషపెట్టి నాపరువు నిలపాలి.

గంగు—(బఙ్సారిముఖంలోకి చూచి,తలవొంచుకొని,మెడలో చేయి పెట్టుకుంటుంది)

బఙ్సా—అర్థమైంది. పెట్టెలో నీయిష్టమొచ్చిన హారంఏదైనా తెచ్చి వేసుకో (అనితాళం చెవులిస్తుంది. గంగు వెళుతుంది)

బఙ్సా—సోఫాలో దయచేయండి.

ముకుం—అభ్యంతర మేముంది? (అని కూచుంటాడు)

బఙ్సా—మృదువుగా సంచరించండి. పోయి పంపుతాను. (అంటూ పోతుంది)

ముకుం—మృదువుగా సంచరించండి. హా హా......జాగ్రత్తగా సంచరించడం అవసరం.....భావగర్భిత శృంగారం......(అంటూ తలూపుతాడు)

(బర్‌సారి గంగుకు చెవిలో ఏదో చెప్పి పంపిస్తుంది. గంగు సోఫాకు కొంచం వెడంగా నిల్చుంటుంది)

బర్‌సా—తొలిగి నుంచుంటాను. (అంటూ చాటుకు వెళుతుంది. ముకుందు గంగూ ఒకరినొకరు చూచుకొని చిరునవ్వు నూచిస్తారు. గంగు సైదువంకచూచి తల వొంచుకుంటుంది.)

ముకుం—గ్రహించుకున్నాను......కొత్త......నునుసిగ్గు సహజం. (అంటూ లేచి గంగుచేయి పట్టుకొని సోఫాలో కూచోపెట్టుకుంటాడు)

ముకుం—నీ పేరేమిటి?

గంగు—గంగు.

ముకుం—బాగుంది.

గంగు—అంటే తియ్యంగుందా? పుల్లం గుందా?

ముకుం—ఊఁ. సమర్థురాలవే.

గంగు—నా సామర్థం మీా కియ్యాలేం తెలుసుద్ది?

ముకుం—మాటల్లో తెలియడం లేదూ?

గంగు—అంతేనా?

ముకుం—గంగూ! యింకెంత కావాలి?

గంగు—హా హా హా హా. పరీక్షన నేరానుగెందా (అని మీాదచేయి వేస్తుంది)

ముకుం—(కౌగలించుకుంటాడు) బ్రహ్మానందమైంది, కాని గంగూ!

తే॥ గీ॥ లే గులాబి పూ వనదగు ♦ లేమ నిన్ను
బాహు బంధంబునన్ దొత్తి♦పట్టి యెంతొ
బాధ కలుగ జేసితి బ్రేమ ♦ పక్షినగుచు
హృదయ మొల్లదు, విధిలేదు ♦ సదయహృదయ॥
నీ కీ బాధ యెంతసేపో చెప్పలేను.

గంగు—బాధా ? బాధేంది, నాజల్మ కింతక న్నేంకావాల? కావిలించి కుంటే బాధకలుగు తుందేంది ? నాకు తెల్దులేండి.

ముకుం—బాధకాదూ? కఠినమైన చేతలు యేమ్తైనా చెయ్యవలసి వొస్తుంది. సుకుమారివి. నాచేతులెంత గట్టిగావున్నాయో.

గంగు—అలాగై తేశానే. మాబాగుంది లేండి, యేందది శాతకాకనా.

(అని ముద్దుపెట్టుకుంటుంది)

ముకుం—అప్పుడే అంతస్వతంత్రిమా?

గంగు—సొతంత్రించక మోతే సాగుతుందాయేంది.

ముకుం—అయితే సరే. నాకుగూడా ఒకముద్దుప్రిసాదించు (అని ముద్దుపెట్టుకుంటాడు)

గంగు—మీకీ సొతంత్రిం యాడనుం చొచ్చింది?

ముకుం—నిన్ను బట్టి నేను. నీవుసహజ సౌందర్యమైన స్త్రీగా నేను పురుషాకృతిగా నీవిక్కడా నేనెక్కడో సంచరిస్తూ యీక్షణం లోయిక్కడ జేరి శృంగార ఘట్టంలో ప్రివేసించడంచేత స్వతం త్రించడానికి కారణమైంది. కాని

గీ॥ హృదయ పేటిక జొచ్చి యం♦దొదిగి యున్న
ప్రేమయను ద్రివ్య మెంత త♦పించి యైన
తొంగిచూచి గాలించి చే♦తో ముదంబు
నందగలనె యంచ నయమే ♦ నాత్మదలతు॥

గంగు—హృదయంలో యాడుందో యెతకాలంటే అల్పం పట్టుది. కమంగ గాని నా పేమ మీ కర్తం కాదుండి. సూత్తారుగా! కొన్నాలు సావాసం సెయ్యండి. నన్ను గాలించండి. నాపేమ కామడక మోతే అడగండి. నానుకూడా గాలించి మీపేమకను క్కంటాను. ఇయ్యాలేగా కాత్త సొతత్రిం కలిగింది.

ముకుం—యిక నా మీద నీకు సర్వస్వాతంత్ర్యిం యిచ్చాను.

గంగు—ఇచ్చిండా్రి?

ముకుం—ఆ.

గంగు—అయితే యీాడనుంచి లెగుండి.

ముకుం—ఊఁ లేచాను.

గంగు—కూకోండి.

ముకుం—కూచున్నాను.

గంగు—నన్ను కావిలించుకోండి.

ముకుం—తప్పకుండా (అంటూ కౌగలించుకుంటాడు. ముకుందు యేదో ఆలకిస్తున్నట్టుగా సూచిస్తాడు)

ముకుం—(ముద్దుపెట్టుకొని) అర్థమైంది. నీది గంభీర హృదయం. నీ శృంగారచేష్టల్లో భావోద్రేక మున్నది.

గంగు—ఉద్రేకమైతే సచ్చిపోవాల్సిందే.

ముకుం—యెందుకూ?

గంగు—యెందుకేంది. అదేకొంప తీసుద్ది. పాణంతీసుద్ది.

ముకుం— హా హా హా హా హా, పిచ్చిపిల్ల (అంటూ ముద్దుపెట్టుకొని) దీని పేరే మంటారూ?

గంగు—యిదేనా ఉద్దేకమంటే?

ముకుం—యింకేమిటి?

గంగు—నేనేందోనని భయమడ్డాను.

ముకుం—నీభయం నేను పోగొడతాను (అని కౌగలించుకొని వీపు చరుస్తాడు)

బక్ సా— (కొంచం కసపడుతూ తనలో) యింకా సరాగాలలోనే వున్నారే (ఆత్రం సూచిస్తుంది)

గంగు—బలే శమత్కారమే.

ముకుం—నన్ను వివాహం చేసుకుంటావా ?

గంగు—యేందీ, యేందీ, మంగళసూత్రం కడతారేంటి?

ముకుం—నీవంగీకరిస్తే.

గంగు—యెందుకు పళ్లపాసి గీక్కానానికా ?

ముకుం—(నవ్వి) మంచిమాటన్నావు. (అనిముద్దుపెట్టు కుంటాడు)

గంగు—అబ్బ అంతగట్టిగా మట్టుకుంటే నొప్పెత్తదూ !

ముకుం—అందు కేమిటి శిక్ష?

గంగు—పది రూపాయలు జరిమా నేశాను.

ముకుం—తప్పకుండా యిస్తాను. (అని పర్సుతీసి యిస్తాడు)

గంగు—యింకోసిచ్చ.

ముకుం—ఊఁ

గంగు—(కౌగలించు కుంటుంది)

ముకుం—(టైము చూచి) అబ్బో అప్పుడే తొమ్మిదిన్నర అయింది. మెయిల్ కి పోవాలి. (అంటూ లేచి) పోతాను. మరచిపోకు.

గంగు—నిద్దరోతానా. (ముకుందు నిష్క్రమిస్తాడు)

బక సా—(ప్రవేసించి) చాకచక్యమంటే నీది. కబుర్లతో పంపించావు

గంగు—యిదో అమ్మా ! (అని నోటు యిస్తుంది)

బక సా—సంపాదించావే ! (అంటూ తీసుకుంటుంది)

గంగు—ఇన్నాలు మీా సావాసం చేసి ఊరికే యిడిచి పెడతానా ?

బక సా—సాహాసం లేంది యీా వ్యాపారం జరగదు. రహాస్యం లేంది గడపదు. యెంతపని చెయ్యడానికైనా వెనుకంజ వెయ్య కూడదు. ఇవ్వి యీా వృత్తికి ముఖ్యమైన హంశాలు. తెలిసిందా ? గంగూ !

గంగు— తెలియాక మోట వేంది, అంతా గయించు కుంటానే వుండా నమ్మా.

బక సా—గ్రహించుకోడం కాదు. అవలంబించాలి. యిప్పుడు(time) టైం యెంత అయిందో ?

గంగు—మన గడేరం యిందాక తొమ్మిదిన్నర కొట్టిం దమ్మగారూ ?

బక సా—మధురబాల, నిద్దరపోతోందా ?

గంగు—(సైడువంక చూచి) అదిగో! ముసుకెట్టి పండుకుండాదు.

బళ్ సా—సరే! నిద్రించనీ! (అని యోచిస్తూంటుంది).

గంగు—అమ్మగోరూ, యేదో ఆలోచిత్తుండారు. నాగురించేనా ?

బళ్ సా—నిన్ను గూర్చి...భవితవ్యాన్ని గూర్చి...ఆలోచించదగ్గదే.

గంగు— యేందో మీామాటలు సూత్తే బయమేత్తోం దమ్మగోరూ.

బళ్ సా—యింత పిరికి దానవా?

గంగు—నామీాన కోప వొచ్చిందేమో అని.

బళ్ సా—లేదు, నిన్ను మెచ్చుకుంటున్నాను.

గంగు—అయితే నాకు బయమేంది, నేనిం కోర్ని లెక్క సెయ్యను.

బళ్ సా—అదే కావలసింది. ముఖ్యమైంది; యీానోటు పెట్టెలోపెట్టు, హారం మెడలో వుంచుకో (అని నోటు యిస్తుంది. గంగు ఆలోచిస్తూ పోతుంది)

బళ్ సా—యిక భయంలేదు...దాక్షిణ్యానికీ నాకూ చాలాదూరం. . ధనార్జన ముఖ్యం...విధిగా జరగవలసిందే...ధైర్యేసాహాసే లక్ష్మి...నిరాటంక జీవితాన్ని అభిలషించడం దోషంకాదు... ఒక గమ్యస్థానాన్ని చేరడానికి మార్గాన్ని అభ్యంతర పెడుతున్న చెడువృక్షాలని ఛేదించడం విధి. ఒక్కొక్క సమయంలో గులాబీచెట్టుకూడా మార్గాన్ని ఆటంక పరుస్తే, తుంచివేయక తప్పదు...మృదుపరిమిళాన్ని గుమ్మరిస్తుందనే ప్రేమ దూర మౌతుంది...సర్పము నోటికి, మండూకం అడ్డుపడితే కుక్షి నింపుకోక, దాని సాధుస్వభావాన్ని మెంచి విసర్జిస్తుందా ? పెద్దపులి యీాసి పిల్లలని భక్షిస్తుంది. అక్క ప్రేమించే వస్తువును, చెల్లి నిరాకరించి అక్కకు అడ్డుతగులుతే సహిస్తుందా... రహాశ్య వ్యాపారం బయటపడేట్టుంటే బయలుచేసేది ప్రాణ బంధువైనా ఉపేక్షించడానికి శక్యమా ?.........సమయం సమీాపిస్తోంది...ఆలశ్యం అమృతం విషం.

(అంటూ నిష్క్రమిస్తుంది). (తెర పడుతుంది)



# ప ది య వ రం గ ము.



స్థలము: ఈశ్వర్లాల్ గృహము. సమయము రాత్రి

నైటుడ్రెస్సులో ఈశ్వరలాల్ ప్రవేసిస్తాడు)

ఈశ్వ—ఆకాశం మేఘావృతమైంది...సుధాకరుడు లోకాన వెండి పూత పూస్తూంటే అతని సౌభాగ్యాన్ని కారుమబ్బు లపహరిస్తున్నాయి. భీభత్సం గాలిపే గర్జనలతో దాడివెడలి ప్రపంచానికి అంధత్వం చేకూరుస్తున్నాయి. రివాల్వర్ ముఖం లోంచి బయల్వెడలి అంతలో అంతర్ధానమయ్యే శిఖజ్వాలలాగ మెరపు తీగెలు నేత్రాల్లో గుచ్చుకుంటున్నాయి. మానవ శరీరాన్ని విడచి వాయువులో మిళితమయ్యే ఆత్మజ్యోతిలా ఆకాశ వీధి లోంచి నిప్పుముద్దలురాలి భూమిలో ఐక్యమౌతున్నాయి. విను వీధిలోంచి ఒక తుపాను బయలుదేరి భూమిని ఆక్రమించ బోతోంది. అలాగే నా హృదయ వీధిలోగూడా తుపాను ప్రారంభించింది. ఈ తుపాను నా మానస లోకాన్ని ముంచి వేస్తుందో, ప్రళయ జంఝామారుతానికి ఆహుతి చేస్తుందో (యోజించి తలూపుతూ) హుం హుం. భ్రమ. కిషోరీ!కిషోరీ!

కిషో—(నైటు డ్రెస్ తో ప్రవేసిస్తుంది)

ఈశ్వ—యేం చేస్తున్నావు?

కిషో—డెటెక్టివ్ నావల్ చూస్తున్నాను.

ఈశ్వ—ఏమిటది?

కిషో—ఒక చౌర్యాన్ని గూర్చి ఒక జవ్వని రహస్య పరిశోధన చేస్తోంది.

ఈశ్వ—పర్యవసానం.

కిషో—పరిశోధన యింకా ముగియలేదు. ఇంతలో నీపిలుపు వినబడ్డది.

ఈశ్వ—నీ చదువుకు భంగం కలుగజేశానా? నీకు నావల్సు మీాద అభిలాష యెక్కువ.

కిషో—తరువాత వెళ్లి (Study) స్టడీ చేస్తాను.

ఈశ్వ—డిటెక్టివ్ నావల్సు చదవడం అంతమంచిదికాదు. పరిశోధకుల చాకచక్యాలు చూస్తూంటే ఉద్రేకం కలుగుతుంది. ప్రమాదం సంభవిస్తుంది.

కిషో—(Culture) కల్చర్ లేకపోతే ప్రమాదమే సంభవిస్తుంది.

ఈశ్వ—అమ్మా! మోహన్‌దాసు నామీద కక్షవహించాడు. యేమి చేస్తాడో?

కిషో—యేమి చేస్తాడు?

ఈశ్వ—ఏమైనాచేస్తాడు యెందుకుచెయ్యడు. దొంగను దొంగా అంటే సహిస్తాడా? చోరుడు హంతకుడౌటంలో అబ్బురమేముంది.

కిషో—నే నున్నంతవరకూ నీవు భయపడ వలసిన అగత్యంలేదు.

ఈశ్వ—లేదు! యెందుకులేదు? ప్రకృతికాంత యెంత భీభత్సంగా ఉందో చూశావా?

కిషో—తండ్రీ ఇంతభయమా? నీ కొకరు చెప్పాలా? ఏదైనా భయం హృదయంలో మెదులుతూంటే చీమచిటుక్కుమన్నా యేదో ప్రమాదము సంభవించి నట్టే, తోస్తూంటుంది. యితరులకేదైనా కీడుచేస్తే క్షణక్షణము తా నొనర్చిన దుష్కృత్యమే కండ్లకు కట్టినట్లుండి భీతికలగజేస్తూంటుంది. నీ వెవరికేం చేశావు? అకారణంగా భయమెందుకు కలుగుతుంది?

ఈశ్వ—అదేమో నేను చెప్పలేను. అయినా యింక యీ జన్మకు కొరత యేమిటి? నీ వివాహం ఒక్కటే మిగిలింది. అదికూడా అయితే మిన్ను విరిగి మీదపడినా నా కేభయమూలేదు. నా జీవిత నాటకానికి భరతవాక్యం చెప్పవచ్చు. ఆ పని చేయవలసింది నీవు.

కిషో—అశ్లీలా లెందుకు ఉచ్చరిస్తావు. నా వివాహంమ్మాత్రం జరక్కుండా వుంటుందా?

ఈశ్వ—(లేని ఆనందము తెచ్చుకొని) తల్లీ అదే నాకు కావలసింది. యెప్పుడు వివాహం చెయ్యమంటావు ? చెప్పుతల్లీ చెప్పు.

కిషో—డిటెక్టివ్ నవల పూర్తిచేసి వచ్చి చెపుతాను. నిద్రపో. (అని నిష్క్రమిస్తుంది)

ఈశ్వ—నవల పూర్తిచేసి వచ్చి చెపుతుంది. యెపుడు చెపుతుంది. కతోర్ మాత్రము నన్ను బ్రతక నిస్తాడా ? పెట్టె తాళా లివ్వలే దని బుసలు కొడుతున్నాడు. వివాహం జరిగితే మార్గాని కొస్తాడని ఆశ. యెలా కానున్నదో తెలియదు. (అని మంచం మీద పడుకుంటాడు. యింతలో యేదో చప్పుడౌతుంది)

ఈశ్వ—(అదరిపడి లేచి) ఏమా శబ్దము ? (అని అటూ యిటూ చూచి) మూషక చక్రవర్తులు విహారం చేస్తున్నాయి. రేపైనా బోను తెప్పించాలి. (అంటూ తిరిగి పడుకుంటాడు)

(కొంచంఆగి కండ్లుకనపడేటట్లు తలకు ముసుకు తగిలించు కొని చేతిలో రివాల్వరుతో మెల్లిగా అడుగులు పెట్టుకుంటూ ఒక వ్యక్తి ప్రవేసిస్తాడు.)

ముసుకు—(అటూ యిటూ కలయజూచి మెల్లిగా) నిశాకాంత నిశ్శబ్దంగా విహరిస్తోంది, అదుగో ఈశ్వర్లాలు. నిద్రాదేవియొడిలో జేర్చుకొని జోలపాడుతోంది. యింకొక క్షణంలో యెక్కడుం టాడో. (అంటూ యీశ్వర్లాలు వంకచూచి) ఈశ్వర్ (అని కేక పెడతాడు.)

ఈశ్వ—(అదిరిపడి లేస్తూ) యెవరు ?

ముసుకు—(This is your end) దిస్ ఈస్ యువర్ ఎండ్. (అంటూ రివాల్వరు పేల్చి వెంటనే పారిపోతాడు)

ఈశ్వ—హా కిషోరీ ! (అంటూ పడిపోతాడు)

కిషో—(పరుగెత్తివచ్చి) తండ్రీ! తండ్రీ! (అంటూ సమీపించిచూచి) అయ్యో తండ్రీ ఇదియేమిటి? గుండెలోంచి రక్తంకారుతోందే మిటి ? (అని కదలిస్తూ) అయ్యో ! తండ్రీ ! మాటలాడవేమి ?

హా హా తండ్రీ! మరణించావా? (అంటూ ఈశ్వర్లాలుమీద పడి దుఃఖిస్తుంది)

కలో—(చేతులతో తలపైకిదువ్వకుంటూ నైట్ డ్రెస్సుతో ప్రవేశించి) కిషోరీ! కిషోరీ! యేమది? అయ్యో హత్య (అంటూ ఫోను దగ్గరకు వెళ్లి రింగ్ చేసి) పోలీస్! ఈశ్వర్లాలు హత్య చేయ బడ్డాడు. (Come up) కం అప్.

కిషో—తండ్రీ నీవు చెపుతూంటే నేను లక్ష్యపెట్టలేదు. భయంచేత అలా అంటున్నావనుకున్నాను. యేదో ప్రబల కారణం వుండడం చేతనే అలా చెపుతున్నావని నేను గ్రహించుకో లేకపోయినాను గ్రహించుకున్నట్టుంటే నేను కూడా యీ గదిలో నీసామీప్యంలో వుండి కాపాడుకొనేదాన్ని. బాబా! నన్ను ఏకాకినిచేసి విడిచిపెట్టి పోయావా? నామీదిప్రేమ అంతా ఒక్కసారి త్యజించావా, హిమానీ సదృశమైన నీహృదయాన్ని పలుగురాయిగా మార్చుకున్నావా? లేకుంటే అతి గారాబంగా పెంచుకున్న నన్ను నిరాధారంగా విడిచి పోవడానికి నీమానసం అంగీకరించిందా? నావివాహం కోసం తపించావే? నీకోర్కె నీడేర్చలేక పోయానే. నాప్రేమను నిష్కళంకంజేసి, నాప్రేమజ్యోతిని వెలిగించి, నాప్రేమతో నేను సామ్రాజ్యం ఏలుతూంటే చూచి, ఆనందించి దీవిస్తావనుకున్నానుగాని, యిలా అకస్మాత్తుగా మృత్యుముఖాన్ని పడతావని స్వప్నావస్థలోకూడా తలంచలేదు. హంతకులబారికి జిక్కుతావని యెన్నడూ అనుకోలేదు. తండ్రీ! నీఋణం, నన్ను పెంచిన ఋణం, నాకు విద్య చెప్పించిన ఋణం నేను తీర్చుకోకుండానే స్వర్గం అలంకరించావు. బాబా! నీహత్యకు మూలం యెవరో, వారిని ఉరికెక్కించి, నీఋణం తీర్చుకుంటాను. అంతవరకూ నిద్రాహారాలను లెక్కచెయ్యను. నా సౌఖ్యాన్ని లెక్కచెయ్యను. యిది నాప్రతిజ్ఞ.

కలో—కిషోరీ! దుఃఖించి లాభంలేదు.

కిషో__(లేచి కోపంనటిస్తూ) నువ్వు యెప్పుడొచ్చావు?

కరో__ఇప్పుడే వొచ్చాను. పోలీస్‌కు రింగ్ చేశాను.

కిషో__యేమని?

కరో__యేమని రింగ్ చేస్తారు? (Murder) మర్డర్ జరిగిందని.

కిషో__నీకెవరు చెప్పారు?

కరో__అదేమిటి నీ వేషుస్తూంటే చూశాను. హత్య జరిగినట్టు, మామ రొమ్ముమీద గాయమే చెప్పింది. యెవరు చెప్పాలి? అడుగో సబుఇనస్పెక్టరు. (సబుఇనస్పెక్టరు నెం. 192 రు కానిస్టేబుల్ ప్రవేసిస్తాను)

సబు__రింగ్ చేసిందెవరు?

కరో__నేను.

సబు__హత్యజరిగి యెంతసేపైంది?

కరో__అరగంట లోపుగా అవుతుంది.

సబు__(శవాన్ని పరీక్షించి చూస్తాడు) రివాల్వర్ దెబ్బ అనుకుంటాను.

కరో__అలాగేఉంది.

సబు__మీ (Father) ఫాదర్ కాదమ్మా?

కిషో__అవును.

సబు__హత్యచేసిం దెవరో తెలుసునా?

కిషో__నాకు తెలీదు.

సబు__విరోధు లెవరైనా వున్నారా?

కిషో__తెలియదు.

సబు__మీ కేమైనా తెలుసా? (అని కరోర్ వంక చూస్తాడు)

కరో__మోహన్ దాసొకడు కక్షవహించి వున్నాడని తెలుసు.

సబు__యింట్లోంచి వెళ్ళగొట్టి జెయిల్లో పెట్టించాడనే కారణం చేత నేనా?

శ౹రో—అవును.

సబు—ఆ (Case) కేసింకా (Pending) పెండింగ్‌లోనే వుంది. 192! యీ శవాన్ని హాస్పటలుకు చేర్చాలి.

కిషో—పోస్టుమార్టమ్ తప్పదా ?

సబు—తప్పదు. పోస్టుమార్టమ్ చేసితీరాలి. ఇదిచాలా (Horrible) హారిబుల్‌గా వుంది. ఒక్కరాత్రి రెండుహత్యలు.

కిషో—రెండుహత్యలా ?

సబు—అవును. రెండోహత్య మధురబాల.

కిషో—మధురబాలా? (ఆశ్చర్యంతో)

శ౹రో—ఆశ్చర్యం.

సబు—ఆమెకూడా రివాల్వర్‌తోటే చంపబడ్డది.

శ౹రో—రాంఛందర్ లేడూ?

సబు—లేదు. యెక్కడకు వెళ్లిందీ తెలియదు.

శ౹రో—ఇంకేమీ అతనిపనే అయివుంటుంది.

సబు—బర్సారికూడా అలాగే చెప్పింది.

కిషో—యీ రెండు హత్యలకూ యేదో (Connection) కనెక్షన్ వుండితీరాలి (యింకాయిద్దరు కానిస్టేబిల్సు ప్రవేసిస్తారు)

సబు—యీశవాన్ని కూడా హాస్పటల్ చేర్చండి. యికనేను వొస్తాను (అంటూ నిష్క్రమిస్తాడు. పోలీసులు శవాన్ని యెత్తుతూంటారు. శ౹రోర్చందు ముందు నడుస్తాడు.)

కిషో—హా తండ్రి! నీకు యెంతగతి పట్టింది. (అంటూ కళ్లు చేతులతో మూసుకొని పోయి సోఫాలో పడిదుఃఖిస్తూవుంటుంది.)

( తెర పడుతుంది. )



# పదునొకండవ రంగము.



స్థలము బయలుప్రదేశము. లాల్చీ, పంచ, చెరిగిన క్రాపుతో విచారంగా రాంచందర్ రాతిపలక పైకూర్చొని వుంటాడు.

రాంచం—మధురబాలా! పాపభూయిష్ఠమైన యీ ప్రపంచంలో నీ వంటి పుణ్యస్త్రీ లుండకూడదని, స్వర్గాన్ని అలంకరించావా? వేశ్యయింట్లో జన్మించావు. వేశ్యయింట్లో పెరిగావు. వేశ్యా సాంగత్యం చేశావు. కాని, వేశ్యావృత్తిని నిరసించావు. స్త్రీ జాతికి ప్రేమయే భూషణమని వేనోళ్ళ చాటావు. నన్ను చేబట్టావు. నన్ను ప్రేమ ప్రవాహంలో ముంచావు. దరిచేర్చ కుండానే దివమలంకరించావు. నిన్ను మరవడంనాకు సాధ్యమా? నిర్భాగ్యుణ్ణి, అంధుణ్ణి. "హత్య" అనేపదం వినేటప్పటికి భీతి కలుగుతోందని నీ మృత్యువును సూచించావు. నేను గ్రహిం చుకోలేక పోయాను. నా కా ప్రయాణం యిందుకే సంభ వించింది కాబోలు. గ్రామాంతరం పోకుండా వుంటే నిన్ను కాపాడుకో కలిగేవాడనేమో? మందభాగ్యుడికి యెందుకు దక్కుతావు. నీ వంటి దివ్యతేజోమూర్తి నాకింక యీ జన్మకు లభిస్తుందా? నీవంటి సాధ్వీరత్నాన్ని గోల్పోయి భారతమాత కూడా మందభాగ్యురాలైంది. దేశక్షేమాన్ని కోరి, దుర్వ్యస నాలని నిరసించి, బోధచేసి, నారీలోకానికి పవిత్రత చేకూ రుస్తూ, సత్ప్రవర్తన కాదర్శప్రాయురాలవైన నీవు గతించా వంటే, ప్రపంచానికి, అంధత్వం యేర్పడ్డదంటే అబ్బురమేముంది? యిక నా జీవిత మెందుకు? నీవులేక నాకీ ప్రపంచంతో పనే ముంది? ప్రపంచంలో యిలాంటి హత్యలకు మూలకందాలైన మత్తుపదార్థాలూ, వ్యభిచారమూ నిర్మూలించి దేశోద్ధారణ చేయడానికి నా ధన, ప్రాణాలను ధారపోస్తాను. ఓ ప్రజా నాయకులారా! ఓ దేశసేవకులారా! యింకెన్నాళ్ళిలా నిద్ర పోతారు?

సీ॥ దినదినంబును కొట్లు ♦ ధనము కొల్లగ గొట్టి
దుర్వ్యాధులకును చే♦దోడొనర్చి
అలుబిడ్డలు తిండి ♦ కల్లాడ నెడబాట్ల
గావించి, చౌర్యాన ♦ కాలుదూర్చి
అంధత్వమును గూర్చి ♦ యబలల, బాలల
నాత్మబాంధవులను ♦ హతమొనర్చి,
కారాగృహము జేర్చి ♦ కఠిన శిక్షల దేల్చి
ప్రాణమానంబుల ♦ పసను దూల్చి
తే॥ గీ॥ దేశ, దారిద్ర్య నాశన, ♦ తీవ్రదుఃఖ
వంచనకరంబులైన దు♦ర్వ్యసన రూప
మధురసము, వేశ్యలనియెడు ♦ నధమజాతి
భూతముల భస్మమొనరింప బొందు లెండు॥
(అంత ముకుందలాల్ సూటుతొడిగి ప్రవేసిస్తాడు)

ముకుం—రామూ ! పాపము మధురబాల..............

రాంచం—మధురబాల! (దుఃఖముతో) యింకెక్కడి మధురబాల. నాకు జన్మదుఃఖముచే కూర్చింది.. స్వర్గంలో నాకొరకు నిరీక్షిస్తోంది.

ముకుం—రామూ! మధురబాలకు మరణమా? లేదు. పొరబడుతున్నావు.

తే॥ గీ॥ సాధ్వులకు సిరో రత్నమై ♦ జగతి బరగి
తారలకునెల్ల తారయై ♦ తనరు, నదిగొ
చంద్ర మండలమున సహో! ♦ చంద్రవదన
"మధురబాలయే" మృతజీవి ♦ పృధివిలోన.

రాంచం—అవును. మధురబాల మృతజీవి. నా హృదయంలో కూడా విలాసంగా సంచరిస్తోంది. ముకుంద్ ! పాపం కిషోరికి కూడా కష్టం సంప్రాప్తమైంది.

ముకుం— అవును. ఆమె దుఃఖాన్ని వర్ణించడానికి అలవిగాకుండా వుంది. ఆమె కింకెవరు ఆధారం ?

రాంభ:—అధారం, ప్రపంచం గుడ్డిది. సన్మార్గులను దుర్మార్గులుగా యెంచి దూషిస్తుంది. వంచన చేస్తుంది. కిషోరి ప్రేమకు తండ్రియే ఆటంక మైనాడు. లేకుంటే, ఈశ్వర్లాల్‌కు మోహన్‌దాసల్లుడై వృద్ధాప్యంలో వున్న తనకు సర్వసౌఖ్యాలూ చేకూర్చేవాడు. యీ అనర్థకాలు జరగడానికి కారణ ముండేది కాదు.

ముకుం—రామూ! మన మనుకోవడమే కాని, ఈశ్వర్లా లేమిచేస్తాడు? మేనల్లునిమీది మమకారంకొద్దీ, మేనల్లున కీయదలచడం సహజమే, కాని, కిషోరి తన ప్రేమకు కళంకం ఆపాదించడానికి అవ్యక్తురాలా ? సీలభంగాని కోరుస్తుందా ?

రాంభం—ఆమెది నిష్కళంకమైన ప్రేమ. గంభీరహృదయం. యిప్పటికైనా ఆ ప్రేమస్వరూపు లొకచోట జేరుకున్నారా ?

ముకుం—యెక్కడచేరటం. ఈశ్వర్లాల్ హత్యాపరాధంతో మోహన్‌దాసు తిరిగి కారాగృహంలో చేరాడు.

రాంభం—మరల కారాగృహమా? మోహన్‌దాసు హత్యచేశాడా? గోరుచుట్టుమీద రోకలిపోటు. యిక కర్షోర్చందు ఆస్తిఅంతా దగ్ధంచేస్తాడు. కిషోరియేంచేస్తుంది పాపం.

ముకుం—(Iron safe keys) ఐరన్ సేఫ్ కీస్ కిషోరి దగ్గరేవున్నాయి. కాని కొంతద్రవ్యం అతని చేజిక్కింది. కిషోరిని వివాహం చేసుకోమని బాధిస్తున్నాడు. యెన్నివిధాలో బెదిరిస్తున్నాడు. ఆమెమాత్రం చోటివ్వడంలేదు.

రాంభం—కర్షోర్చంద్! కిషోరిని వివాహం చేసుకోవడం నీకుసాధ్యమవుతుందా? నీ వర్హుడవా? నీదుండగాల నామె సహిస్తుందా? మూఢుడా! అగ్నిహోత్రాన్ని ముట్టకు. దగ్ధమౌతావు.

ముకుం—ఈశ్వర్లాల్ని మోహన్‌దాసే చంపివుంటాడని కర్షోర్చందు వాదన.

రాంభం—యేమో. తనకెలా తెలుసు? మోహన్‌దా సప్పుడప్పుడూ ఈశ్వర్లాల్‌కు ప్రతీకారం జరిగి తీరుతుందని అనేవాడు. జెయి

ల్లోంచి హామీయిచ్చి నేను విడుదల చేయించి నప్పుడుకూడా అన్నాడు.

ముకుం—కిషోరితోగూడా ఒకటిరెండు పర్యాయము లన్నాడట. హత్యకు ముందు ఈశ్వర్లాలుతోటే అన్నట్లుగా ఆరాత్రి ఈశ్వర్లాలు కిషోరితో చెప్పి భీతిచెందినాడట. ఇదే నిజమైతే కిషోరిప్రేమ వ్యర్థమౌతుంది. ఆమెజీవితమే వ్యర్థం. ఆమెకు ప్రపంచమే సూన్యమౌతుంద. మోహన్‌దాసుకు శిక్షతప్పినా హంతకుణ్ణి వివాహంచేసుకొని తలయెత్తితిరగడం సాధ్యమా. బ్రహ్మచర్యమే అవలంభిస్తుందో ఆత్మహత్య చేసుకుంటుందో తెలీదు.

రాంభం—మోహన్‌దాసు నిర్దోషి అని నాహృదయం ఘంటాపదంగా చెవుతోంది. ఈ హత్య మోహన్ చేసివుండడు.

ముకుం—అతని నిర్దోషత్వాన్ని ధృవపర్చడమే కాకుండా రహశ్యాన్ని భేదించి యీ రెండు హత్యలకు మూలమెవ్వరో వారి నురి కెక్కించాలని ఆమెప్రతిజ్ఞ. ఆలోచనా సముద్రంలో మునిగి పోయింది. కార్యనిర్వాహకానికి నన్ను కోరింది.

రాంభం—"పరోపకారార్థ మిదం శరీరం" సహాయపడు. నేనుకూడా సహాయం చేస్తాను. ఆమె ప్రేమజ్యోతిని, దేదీప్యమానంగా ప్రకాశింపచేదాం.

ముకుం—యీ విషయంలో పాపం సరోజ చాలా త్యాగం చేస్తోంది.

రాంభం—అదే మైత్రిలోవున్న సుకృతం. మనకీ సంభాషతో కాదు. కాలంచాలా విలువగలది. పరిశోధనకు గడంగాలి. నీపనిమీద నీవుండు. నేనుకూడా శాయశక్తులా పాటు పడతాను.

ముకుం—సరే. నేను సెలవు పుచ్చుకుంటాను. (అనినిష్క్రమిస్తాడు.)

రాంభం—కాలం! ప్రపంచంలో న్యాయానికి స్థానంలేదని మోహన్ దాసు చెప్పిన వాక్యాలు కర్ణరంధ్రాల్లో ప్రతిధ్వనించడమే కాకుండా కన్నులకు కట్టినట్లున్నాయి. (నిట్టూర్పువుచ్చి) గ్రామంలోనికిపోయి, ఒకసారి కిషోరిని కలుసుకుంటాను.

# పన్నెండవ రంగము.

స్థలం: (కారాగృహంలో మోహన్ దాస్ పిచ్చిఅవతారంతో వుంటాడు)

మోహన్—హత్య_ఈశ్వర్లాల్--హత్య. చేశాను. నేను చేశాను. యెప్పుడు? లేదే! కాదు. కిషోరిచేసింది. ఉహుఁ నేనే చేశాను. ఉరిశిక్ష కావలసిందే. ఈ ద్రోహి యీ ప్రపంచంలో వుండ తగడు. దుర్భర జీవితం. దుస్సహాపవాదం. న్యాయపీఠాలు గ్రుడ్డివి. ఈ తుచ్ఛుణ్ణి శిక్షించడానికి యింత కాలయాపనా? హుఁహుఁ. హత్య కర్రోరే చేస్తాడు. అబ్బా జ్ఞాపకంలేదు. ఈశ్వర్లాల్! భూతాకృతితో నన్ను మ్రింగి నీకక్ష తీర్చుకోరాదా? నాదరి చేరడానికి నీకింకా భీతికలుగుతోందా? నీ కూతుర్ని ఆవేసించి నన్ను హత్య చేయించరాదా? నీ అంతరాత్మకు శాంతి చేకూర్చుకోరాదా? కిషోరీ! ఈశ్వర్లాల్‌కు నీ వెక్కడ కూతురవు? నీ తండ్రిని హత్యజేసిన నన్ను, నన్ను కాదు, బన్సారిని, ఉహుఁ కాదు, నన్నే, నన్ను బలిచేసి, నీ తండ్రి ఋణము తీర్చుకోలేవా? అసమర్థురాలవా? క్రోధాగ్ని నీ హృదయంలో ప్రజ్వలించడం లేదా? నీ తండ్రి మరణము నీకు సంతోష ప్రదమైందా? జ్ఞానహీనురాలవా? హంతకుణ్ణి గుర్తించ లేవా? ఆ శ్రమ రక్షకభటులు తీర్చారుకదా? లేకుంటే హంతకుడిచెంత జేరటానికి భీతి కలుగుతోందా? ధైర్యసాహసములు లేవా నీకు? నిన్ను హత్యచెయ్యను. రా. నన్ను (Fire) ఫైర్ చెయ్యి. నీజోలికిరాను. స్మితవదనంతో నా ప్రాణాలు నీ కర్పిస్తాను. లేకపోతే నీ బావను పంపు. కర్రోర్! సమయం చిక్కింది. నీ పగ సాధించుకో. తరుణం పోగొట్టుకోకు. అంధుడా! భీరుడవు, నీ చేతకాదు. బన్సారీ కర్రోర్‌కు నీవైనా ప్రోత్సహించు. ధైర్యం కలిగేట్టు తాగించు మెడపట్టిగెంటు. ఊఁ అలసించకు.

(జైలు వార్డరు అన్నం తెస్తాడు. మోహన్ వార్డర్ను చూసి)

బర్ సారి పంపిందా? కఠోర్! వొచ్చావా? ఊఁ కానియ్యి, చంపు. (అంటూ ఎదురు రొమ్ము చూపిస్తూ) మూర్ఖుడా, చూస్తావేం? చంపు; చంపవా? చంపవా? (అంటూ మెడ పట్టుకొని వూపుతాడు.)

వార్డరు—(చేతులు తీస్తూ) యేమయ్యా! పిచ్చిపట్టిందా. అన్నం తెచ్చాను.

మోహన్—హుఁహుఁ. పిచ్చి. పిచ్చివానికన్నం తెచ్చావా? అన్నం కాదూ, పో పో కఠోర్చందును పంపు. బర్ సారితో చెప్పు. ఊఁ, పో, (అంటూ గెంటి) అన్నం! ప్రాణంతో వున్నవాడికి అన్నంకావాలి, జీవన్మృతుడికి క్షుత్పిపాసలుంటాయా? నిద్దుర వొస్తుందా? తెలివితక్కువ దద్దమ్మలు. (అంటూ పచార్లు చేస్తూ తలగోక్కుంటూ వుంటాడు)

ముకుం—(ప్రవేశించి చూచి) దుస్సహ దృశ్యం (అని నిట్టూర్పు విడుస్తాడు)

మోహన్—(Brutes) బ్రూట్సు, ప్రపంచానికి మెదడు లేదు. కిరాతులు. ఈర్ష్యాస్వభావులు. హేళనోద్యోగులు.

ముకుం—మోహన్ దాస్!

మోహన్—యెవరు? (అని చూచి) కఠోర్! తుచ్ఛుడా! రా, కక్ష తీర్చుకో (అంటూ పళ్లు కొరుకుతూ) ఇదినీ అంత్యదశ, నిన్ను సహించను. (అంటూ మీదికి పోతాడు)

ముకుం—ఆఁ, మోహన్! పొరబడుతున్నావు. నేను కఠోర్చందును కాదు.

మోహన్—కాదా? కాకపోతే పో, నీతో నాకు పనిలేదు, కఠోర్చందుని పంపు, వాడి రక్తం తాగుతాను.

ముకుం—మోహన్!

మోహన్—యింకా యిక్కడే వున్నావా? మూఢుడా. పో? పోవేం?

ముకుం—నీతో అవసరముంది.

మోహన్—అయితే నీవు కళోర్చందువే. కృత్రిమ వేషంలో వొచ్చావు. నన్ను మోసం చేస్తున్నావు. ప్రపంచం గ్రుడ్డిది. నిన్ను గుర్తించ లేదు.

ముకుం—కాదు. యీ రహశ్యాన్ని భేదించడానికి ప్రయత్నిస్తున్నాను.

మోహన్—నీ కేం సంబంధం ?

ముకుం—ఉన్నది గనుక నే.

మోహన్—నీ చేతకాదు. అంధుడవు.

ముకుం—కొద్దిలో అర్థమౌతుంది. హత్యచేసింది నీవా ?

మోహన్—కారాగృహంలో వున్న దెవరు ?

ముకుం—కాదు. నీవు చేశావా ?

మోహన్—ఏమో

ముకుం—సందిగ్ధ వచనాలు.

మోహన్—హాహాహాహాహా ! హత్యచేసింది నేను. చోరుణ్ణి నేను. హంతకుణ్ణి నేను. శిక్షకావలసింది నాకు.

ముకుం—ఉన్మాదావస్థ.

మోహన్—ఉన్మాదావస్థ నీకు. నాకు నిద్రవొస్తోంది. పో (అంటూ పోయిపడుకుంటాడు)

ముకుం—యిట్టిస్థితిలో మతిభ్రమణము సహజమే.....హత్యచేశా నంటున్నాడు...ఊహాతీతంగా వుంది....విమర్శనకు స్థానం యివ్వడంలేదు....నిస్పృహ చెందనూ కూడదు....యీ ఉద్యమం లో కృతప్రజ్ఞుణ్ణి కావాలి......అంతా రహశ్యమే? పాపం బిడ్డలమ్యే కాలం ఆసన్నమౌతోంది.

మోహన్—(లేస్తూ) నిద్ర, యెక్కడ నిద్ర. శాశ్వత నిద్రపోవాలి. (అంటూ ముకుందుసిచూచి లేచివొస్తూ) యింకాపోలేదూ ? ఊన్మత్తుడా! కదులు.

ముకుం—మోహన్ దాస్ ! కొంచం సిదానించు.

మోహన్—నిదానం! నిదానంయెలాకలుగుతుంది? ఉన్మత్తులకువిమర్శ నాజ్ఞానంవుంటుందా? ద్రోహంచేస్తూన్న ప్రపంచాన్ని చూచిసహించడమా? నాయింట్లో నేనుంటే ప్రపంచానికి ఈర్ష్యకలిగింది. నాతిండి నేను తింటే ప్రపంచం ఓర్చలేకపోయింది. యీప్రపంచానికీ నాకూ విరోధ మేర్పడ్డది. అందుకని ప్రపంచం నన్ను చూసి నవ్వుతోంది. హేళనచేస్తోంది. దూషిస్తోంది. కారణము? నేను హంతకుణ్ణి. ఈశ్వర్లాల్ని హత్యచేశాను. కాని అదిస్వప్నావస్థ. ఈకండ్లకు తెలియదు. ఈహస్తాలకు తెలియదు. కాళ్లు బరువెక్కినహృదయాన్ని కారాగృహంలో చేర్చినాయి. ఏకాకిని. హితదూరుణ్ణి. యెందుకు నిదానం? యెవర్ని ఉద్ధరించడానికి?

ముకుం—కిషోరిని. ఆమెనిన్ను ప్రేమించింది.

మోహన్—కిషోరి హంతకుణ్ణి ప్రేమించేంత అవ్యక్తురాలా?

ముకుం—ప్రేమ గ్రుడ్డిది.

మోహన్—అవును, ప్రేమగ్రుడ్డిది, ప్రేమకు వివేచనజ్ఞానం లేదు. చోరుడైనా అధీశ్వరుడే. హంతకుడైనా అధీశ్వరుడే.

ముకుం—ఆమె నీకోరకు ప్రాణాలైనా విసర్జించడానికి సంసిద్ధురాలై వున్నది.

మోహన్—హా! ప్రాణాలు. ప్రాణాలువిసర్జించడానికి. కిషోరీ! సాహసించకు. వృధా..నీకోర్కె వృధా. నీ లేతనూలతను బాధపెట్టకు.

ముకుం—మోహన్! యీ హత్యరాత్రి నీవెక్కడున్నావు?

మోహన్—వసతిగృహంలో నిద్రావస్థలో. మరురాత్రి యీ కారాగృహంలో ఉన్మాదావస్థలో.

ముకుం—అర్థమైంది. ధైర్యం అవలంభించు. ధర్మమేజయం.

(అంటూ నిష్క్రమిస్తాడు)

మోహన్—(చూస్తూ) ధర్మమే జయం. ధైర్యం అవలంభించాలి, ధర్మమనేపదం నిఘంటువుల్లోకూడా లేకుండాపోయే కాలం సమీపించింది. శాస్త్రకారుడుపొరబాటున వ్రాశాడు. పాపం!

కిషోరి బ్రహ్మచర్యం అవలంబిస్తా నన్నది. యీ తుచ్ఛుడు కోసం ఆమె ప్రాణం యెంత ఘోషిల్లుతోందో. కిషోరీ! ఈజన్మకు నిన్ను చూచేయోగం లేదు. నీ నిష్కళంక ప్రేమకు ప్రతిఫలం చూపే ప్రాప్తంలేదు. అమరత్వాన్ని ప్రసాదించే నీ ప్రేమామృతాన్ని త్రాగి, నీ హృదయమనే స్వర్గంలో తాండవించే గీతలేదు. నీ తండ్రిని జంపిన హంతకుణ్ణి నేనేనని నీవుకూడా నమ్మి, నీహృదయంలోంచి పిడుగులవంటి శాపవాక్యాలను నామీద రువ్వి నా దుఃఖానికి అంతం చూపించు. హుః. అంతం దుఃఖానికి అంతం. (అంటూ వెనక్కు తిరిగి పోతూంటే తెర పడుతుంది.)



# పదమూడవ రంగము.



(పోలీస్ స్టేషన్, సబ్ ఇనస్పెక్టర్ కాగితాలు చూచుకుంటూవుంటాడు)

సబు—యీ కేసులు కాదుగాని (Brain) బ్రెయిన్ అంతా పాడై పోతూంది. సాక్ష్యం బనాయించి (Charge Sheet) ఛార్జి షీట్ పెట్టేవరకు రంకు మొగుళ్లలా తగులుకుంటారు. పై అధికార్లు విచారిస్తూన్న కేసులకు యింతవరకూ మోక్షం కలగలేదు. మధురబాల (Murder investigation) మర్డర్ ఇన్వెస్టిగేషన్ యేమైందన్న సతాయింపులతో చచ్చిపోతున్నాను.నిజమోఅబద్ధమో రాంఛందర్‌నుకూడాఅరెష్టుచేసిఛార్జి షీటు పెట్టినట్టుంటే పీడా వొదలేది. ఈశ్వర్లాలు మర్డర్ కేస్ (File public prosecutor) ఫయిల్ పబ్లిక్ ప్రాసిక్యూటర్ మొఖాన పారేస్తే సగం బరువు తగ్గుతుంది. సగం విచారణ ఐనా (file) ఫైలు పూర్తిగా ఇవ్వలేదని ఆయనో యేడుపు. నిద్రాహారాలు లేకండా చస్తూంటే (file) ఫైలు తయారు కావొద్దూ. అబ్బ అబ్బ. విసుకెత్తుతూంటే పోలీసు ఉద్యోగం

చేసినంత బుద్ధి తక్కువ యింకొకటిలేదు. దయాదాక్షిణ్యాలు విడిచి పెట్టాలి మిత్రిబంధుత్వాలు లెక్క పెట్టకూడదు. ఛీ ఛీ మూడూ పందొమ్మిది! (319) యీ (file) ఫైలు (Public prosecutor) పబ్లికు ప్రాసిక్యూటర్ కు పారేసిరా. (అని యిస్తాడు, కానిస్టేబు తీసుకొపోతాడు సిగరెట్ కాల్చుకుంటూ కూచుంటాడు) (unfortunate) అన్ఫార్ట్యునేట్, (My love) మై లవ్ సరోజాను కలుసుకోవాలంటే తీరడం లేదు. సరోజా ఆరోజున యిచ్చిన అడ్రిస్ ప్రికారం రెండు సార్లు వెళితే తలుపు తాళంవేసి వున్నది. (Neighbours) నైబర్సు నడిగితే గ్రామంలో లేదన్నట్టుగా జబా బొచ్చింది. (Further information nil) ఫర్ దర్ ఇన్ఫర్ మేషన్ నిల్ రేపైనా మళ్ళీ (try) ట్రైచేసి చూడాలి. రెండూ పదహారు! (216) కప్పు కాఫీ తెచ్చిపెట్టవోయ్.

(ఇంతలో ముకుందలాల్ ప్రవేసించి విష్ చేస్తాడు)

సబు—(ఆపాదమస్తకంచూచి) యేం పని?

ముకుం—(Just few minutes) జస్టు ఫ్యూమినిట్సు మాట్లాడాలి.

సబు—ఏ విషయంలో?

ముకుం—ఈశ్వర్లాల్ (Murder) మర్డర్ విషయంలో.

సబు—మీకు బంధువుడా?

ముకుం—కాదు.

సబు—అయితే ఆవిషయం మీ కెందుకు?

ముకుం—అవసర మున్నది.

సబు—ఇక్కడ (Information) ఇన్ఫరమేషన్ దొరకదు. (Public prosecutor) పబ్లిక్ ప్రాసిక్యూటర్ని అడగండిపోయి (అంటూ కానిస్టేబుల్ తెచ్చిన కాఫీ త్రాగుతూంటాడు.)

ముకుం—కేసు (Investigate) ఇన్ వెస్టిగేట్ చేసింది మీరు కదా?

సబు—అయితే. నా కర్థంకాలేదు. వొచ్చినవాళ్ళకల్లా (Information) ఇన్ఫర్మేషన్ ఇవ్వాలా?

ముకుం—ఇవ్వాలో అక్కర్లేదో. ఆ (Discussion) డిస్కషన్ ఇప్పు డనవసరం. (District Collector orders) డిస్ట్రిక్టు కలెక్టర్స ఆర్డర్సు......

సబు—మీపేరు ముకుందలాలా? (అంటూ కుర్చీలోంచి లేస్తాడు)

ముకుం—అవును.

సబు—(Excuse me) ఎక్స్క్యూజుమీ ఇదివరకు మీతో (Acquaintance) ఎక్వయింటెన్సు లేకపోవడం ప్రమాదమైంది. కూర్చోండి. (అని యిద్దరూ కూచుంటారు)

సబు—యెవరోయ్! యింకోకప్పు కాఫీ తీసుకొనిరా.

ముకుం—యిప్పు డవసరంలేదు.

సబు—పరవాలేదు. కొంచం పుచ్చుకుందురుగాని.

ముకుం—అప్పుడే (Charge sheet) ఛార్జి షీట్ పెడతారనుకోలేదు.

సబు—(Murder case) మర్డర్ కేస్ అవడంచేత (Superior officers) సుపీరియర్ ఆఫీసర్సు (Worry) వర్రీ చేస్తారని తొందరపడవలసి వచ్చింది. అయినా (theft case) థెఫ్టు కేసులో (C. I. D.) సి. ఐ. డి. ని (Appoint) అప్పాయింట్ చేసినట్టుగా వెనక (Order copy) ఆర్డరు కాపీ (Communicate) కమ్యూనికేట్ చేశారు. మర్డరు కేసులో కూడా మీరు (Work) వర్కుచేస్తూన్నట్టు నాకు తెలీదు.

ముకుం—(theft) థెఫ్టు జరిగిన యింట్లోనే మర్డరు జరిగింది. చేసింది కూడా (Same person) సేం పెర్సన్. అలాంటప్పుడు అందులోవున్న (Secret) సీక్రెట్ ఇందులో యెందుకుండదు? (Work) వర్కుచేస్తున్నా ననుకోక పోవడమేమిటి?

సబు—ముందుగా నాకు (Information) ఇన్ఫర్మేషన్ ఇస్తే బాగుండేది. కాఫీ చల్లారి పోతుంది త్రాగండి. (అంటూ కొంత తాను తీసుకొని కొంత ముకుందునకు యిస్తాడు)

ముకుం—(తీసుకొని తాగుతూ) (Theft) థెఫ్ట కొంతవరకూ (trace)ట్రేసైందిఇంతలో(Murder)మర్డర్ జరిగింది.(Severe) సివియర్ గా వర్కు చేస్తూండడం చేత (Information) ఇన్ ఫరుమేషన్ ఇవ్వడానికి (Time) టైం లేకపోయింది.

సబ్—(Past is past) పాస్టీజ్ పాస్టు, ఇప్పటికైనా తొందరపడండి.

ముకుం—(Trial) ట్రయలెంత వరకు జరిగింది?

సబు—(Arguments) ఆర్గ్యుమెంట్సు కాలేదు. గవర్నమెంటు వకీలు (Two days time) టూ డేసు టైం కోరాడు.

ముకుం—సరే మోహన్ దాసును ఏ (Basis) బేసిస్ మీద అరెస్టు చేశారు?

సబు—యేముంది (Theft) థెఫ్టు కేస్ మీకు తెలిసిందే కదా. అప్పుడు ఈశ్వర్లాల్ మోహన్ దాసును జెయిల్లో పెట్టించడంకూడా మీకు తెలిసేవుండవచ్చు. ఆకోపం మనస్సులో పెట్టుకొని (Opportunity) ఆపర్ట్యూనిటీ కోసం (Wait) వైట్చేసి ఆరాత్రి హత్యచేశాడు.

ముకుం—సాక్ష్యం?

సబు—కిషోరి (Blunt) బ్లంటుగా (Refuse) రెఫ్యూజ్ చేసింది. కమోర్చందు (Witness) విట్నెస్ ఇచ్చాడు. కిషోరికికూడా వారంటుచేయిద్దామనుకున్నాగాని అవసరమున్నట్టు తోచలేదు.

ముకుం—ఒక్క (witness) విట్నెసు తోటే?

సబ్—చోరీకేసే పెద్ద(witness)విట్నెసుఅయింది. అయినా (As a fact) యాజెఫాక్టు అతని కంతకన్న విరోధులెవరూ లేరు దానికి తగ్గట్టుగా మోహన్ దాస్ కూడా (Contest) కంటెస్టు పెట్టుకోవడంలేదు. కమోర్చందునైనా లాంఛనానికి సాక్ష్యం వేశాము కాని యీ కేసుకు సాక్ష్యమే అక్కర్లేదు.

ముకుం—అయివుండవచ్చు.

సబు—పోనీ మీదృష్టిలో యీ (Murder) మర్డర యింకెవరైనా చేసినట్లు.........

ముకుం—లేదు. కాని, మధురబాల మర్డరేమైంది?

సబు—యింకా (Investigation)ఇన్‌వెస్టిగేషన్ పూర్తి కాలేదు.

ముకుం—యెవరిమీదనైనా అనుమానం?

సబు—రాంఛందర్‌మీద అనుమానమున్నది కాని, యింకా ధృఢపడలేదు.

ముకుం—అనుమానానికి కారణం?

సబు—యింట్లోవాళ్లు చెప్పినదాన్ని బట్టి.

ముకుం—మరి యీ జాగెందుకు?

సబు—మధురబాలకి, రాంఛందర్‌కి సఖ్యం జాస్తిఅన్న సంగతి నాకు కూడా తెలుసు. రాంఛందర్ (Murder)మర్డర్ చెయ్యడానికి తగినంతకారణంకనపడటంలేదు.ఆయింట్లో,గంగుఅనేపిల్లదాశ్యానికుంది, దాన్ని (Seperate) సెపరేట్‌గా విచారిస్తే యేమైనా తేల్తుందేమోనని వున్నది.

ముకుం—సరే, నేను చూస్తాను. యేసమయంలో యే అవసరమొస్తుందో. మీరు విస్తారం స్టేషన్‌లో...(అంటూ లేస్తాడు)

సబు—అలాగే, కాకీతో కబురుచేస్తే వొచ్చి వాల్తాను.

ముకుం—(good-bye) గుడ్ బై (అంటూ నిష్క్రమిస్తాడు).

సబు—(good-bye) గుడ్ బై (అంటూ చూస్తూ నిల్చుంటాడు).

సబు—వీడి పిండాకూడు. వీను పరిశోధనచేసేట్టా. యేం చేస్తాడు. కేసు కళ్ళకు కట్టినట్టు కనిపిస్తూంటే యేదో అవసరం పడుతుందిట. (Brain less) బ్రెయిన్ లెస్. యెవరినైనా అనుమానించి వాళ్ళచేతుల్లో చిక్కితే విడిపించడానికి అవసరం పడాలి. పోనీ కర్పోర్చందు ననుమానిస్తున్నాడా అంటే అందులో అర్థం లేదు. బన్సారికి ఈశ్వర్లాలుకి సంబంధం లేదు. (Own sister) ఓన్ సిష్టర్ని యెవరైనా చంపుకుంటారా? ఈశ్వర్లాల్‌కు కర్పోర్చందు మేనల్లుడు. కూతుర్నికూడా ఇవ్వదలచాడు. ఇవ్వాళ కాకుంటే రేపైనా ఆస్తిఅంతా అతని చేతికేదే.

అతను చంపడానికి కారణంలేదు. ఊఁ యెలాగైనా యేడవనీ. మధురబాల మర్డరు విషయం నెత్తిన పెట్టుకొని నాకు కొంత విరామం కలిగించాడు. ఆపాపఖర్మం నాకెందుకు(thank god) థ్యాంక్ గాడ్. (అంటూ నిష్క్రమిస్తాడు)

(తెరపడుతుంది)



# పదునాల్గవ రంగము

స్థలం—బడాసారి గృహం. రాత్రిసమయం. కిశోర్చందు సోఫాలో కూర్చుని వుంటాడు. గంగు ఆలోచిస్తూ కిందంగా కూంచొని వుంటుంది. బల్లమీద సీసా గ్లాసూ వుంటాయి.

కిశో—చుట్టం. బంధువు...అన్న...ఏకాంతం...బాగుంది. గంగూ!

గంగు—(మాట్లాడదు)

కిశో—(గంగువంక చూస్తూ) గంగూ?

గంగు—(ఉలికిపడి) బాబూ.

కిశో—ఏమిటో ఆలోచిస్తున్నావూ?

గంగు—యేమీలేదు బాబూ.

కిశో—మీ యాయన జ్ఞాపక మొచ్చాడా?

గంగు—మరే. మాయాయన! నాకేటి మొగుడండి.

కిశో—పోనీ. వలపుగాడు యీమధ్య వొస్తున్నట్టు లేదు.

గంగు—యెప్పుడూ యాపారమేనంటండి. నిన్న వొచ్చిందు కూచే పన్నా వుండనేదు. మల్లీ ఇయ్యాలొత్తానన్నాడు రానేదు.

కిశో—నీవు చాలా మంచిదానివి.

గంగు—నా మంచితనం మీ కిప్పుడే యేటి తెలిసిందండి.

కిశో—తెలియటంలేదూ! సరేగాని మీ అమ్మతో మాట్లాడే దెవరు?

గంగు—అన్నగారంటండి.

కరో—నేనెప్పుడూ చూడలేదు.

గంగు—యెప్పుడూ రానేదంటండి.

కరో—యెప్పుడూ రాలేదు.

గంగు—మధురబాలమ్మగార్ని సంపిందేరో తెలిసిందండి ?

కరో—ఆమాటయెత్తకు. గంగూ! నాకెందుకో భీతికలుగుతోంది.

గంగు—మీకు బయమేటండి? కూంతపుచ్చుకోండి (అంటూగ్లాసుతో ఇస్తుంది)

కరో—(తాగుతూ) పాపం. మధురబాల బ్రహ్మరాక్షసి చేతుల్లో పడ్డది. బర్‍సారీ! నన్ను అంధుణ్ణిచేస్తున్నావు. నీ అన్న కాదు.

గంగు—మోహనయ్యగార్కి మీమామగార్ని నంపినందుకు సిచ్ఛ అయిందా బాబూ? (అంటూ యింకోగ్లాసు యిస్తుంది)

కరో—(త్రాగి వెఱ్ఱిచూపు చూస్తూ) శిక్ష. శిక్ష. ఈశ్వర్లాల్ను హత్య చేసినందుకు శిక్ష.

గంగు—అదేంది బాబూ, అయిపోయిందా ?

కరో—(వినిపించుకోకుండా కళ్లు నలుపుకొని చూస్తూ) యెవరూ? యెవరూ? ఈశ్వర్లాల్ ! నామీదికి రాకు. నిన్ను నేను హత్య చేయలేదు. మోహన్‍దాస్ చేశాడు. అక్కడికి పో. జెయిల్లో వున్నాడు పో ! పో. మామా...నన్ను క్షమించు. మేనల్లుణ్ణి. కోపగించకు. నేనేం చేశాను?

గంగు—అట్టాసూత్తారేంది బాబూ? ఆడవోరున్నారు.

కరో—ఈశ్వర్లాల్, అగ్నిజ్వాలల గ్రక్కుతూ నన్ను మింగుతానంటున్నాడు. సహాయం. సహాయం. యెవరూ రారూ? యెవరూ రక్షించరూ ? మీకు హృదయాల్లేవూ? కనికరం కలగదూ? క్రూరరాక్షసుడనా? భీతహృదయుడను. నిస్సహాయుడను. ఇంత ఈర్ష్య యెందుకు? హా! హా! మామా...మామా ! పెంచావు. పెద్దవాణ్ణిచేశావు. ద్రోహం చేసినా, క్షమిం

చాలి, నాకేం తెలీదు. నీఆకృతిని నేను చూడలేను. మోహాక్ దాసుకు శిక్ష అవుతుంది, నీకక్ష తీరుతుంది. నీ ఆత్మకు శాంతి చేకూర్చుకో. అయ్యో నామాట వినవూ? రివాల్వరు పారెయ్యి, నిన్ను ప్రార్థిస్తాను. మధురబాలా! నువ్వు కూడా నామీదికే వొస్తున్నావా? నిన్ను నేనేం చేశాను? అన్యాయం, అక్రమం, నీసోదరి బక్సారి వున్నది, లోపల వున్నది. పో అక్కడికి పో. నీకు నమస్కారం చేస్తాను. (అంటూ చేతులతో మొగం కప్పుకుంటాడు.)

గంగు—పాపం, హృదయవేదన, ప్రత్యక్షం అయి భ్రమకలిగిస్తున్నారు.

కరో—(తలవ్రాపుకుంటూ) ఇక సహించను. ఇకసహించను. బక్సారీ, బక్సారీ! (అంటూ గంగు ముఖంలోకి కోపంగా చూస్తాడు).

గంగు—ఇందేందిబాబోయ్, అమ్మా, అమ్మా (అని కేకలు పెడుతుంది)

బక్సారి—(ప్రవేసించి) యేమిటే?

గంగు—అయ్యకు పిచ్చెత్తింది. నాకు భయమేత్తోంది.

కరో—(Devils) డెవిల్సు, తీవ్రవృక్కులు ప్రతీకారం. అబ్బా. దుర్భరం. నేను బ్రతకలేను.

బక్సారి—కరోర్! యేమిటది?

కరో—బక్సారి బక్సారి! అదిగో! మధురబాల, ఈశ్వర్లాల్! నన్ను రక్షించు. (అంటూ దగ్గరకుపోతాడు.)

బక్సారి—అంధుడా! అక్కడేమున్నాయి? దీపముంది. గోడలున్నాయి. యిక్కడ మన మున్నాము.

కరోర్—అదిగో చూడు, గుర్రుముతున్నారు. పైకి దూకుతున్నారు. ప్రాణం తీస్తారు.

బక్సారి—ఓరి తుచ్ఛుడా! యింత పిరికిపందవా? నీ మేకపోతు గాంభీర్యాన్ని చూచి మోసపోయాను. నాసోదరి మరణాన్నికూడా లెక్కపెట్ట లేదు. నీగురించి నాప్రాణాలైనా విడవడానికి సిద్ధంగావున్నాను.

కశోర్—బళ్ సారీ! అదిగో నీసోదరి యిప్పుడు నాప్రాణాలు తియ్యా డానికి సిద్ధంగావుంది. నీవే మధురబాలవేమో, నన్ను మోసం చేస్తున్నావేమో, నీమోసానికి నేను లొంగను. నన్ను చంపడం నీకు సాధ్యం కాదు.

బళ్ సా—మందుడా! నీగ్రహచారం చాలలేదు. నిన్నుపట్టి నా గ్రహచారంకూడా చాలినట్లు కనుపించదు. నీధోరణి వింటే అనుమానించి రక్షక భటులు మనలను బంధించకమానరు.

కశోర్—బంధిస్తారు, తప్పదు. అదిగో ఈశ్వర్లాలు చెబుతున్నాడు. మధురబాల శపిస్తోంది, నీ కురిశిక్ష, నాకే జీవితమే శిక్ష.

బళ్ సా—ఛీ నోరుముయ్యి! అవ్యక్తప్రసంగాలు చెయ్యకు. యెవరికి శిక్ష? నీకూ శిక్ష. వ్యర్థుడా. స్త్రీ జన్మకు మెత్తాలిసింది, పురుషుడవై జన్మించావు. నీ బతుకెందుకు? పౌరుషహీనమైన బ్రతుకు? లజ్జారహితమైన బ్రతుకు. ఆత్మహత్యచేసుకో.

కశోర్—పౌరుషం. పౌరుషానికి నీ ప్రోత్సాహమే కారణం. ఇప్పుడు నీ ప్రోత్సాహంలో పటుత్వం లేదు.

బళ్ సా—భండాలుడా! పటుత్వం నసించింది. మృత్యుసూచనలు దొర్లుతున్నాయి. దాస్యానికికూడా తగవు. తెగతాగు. ధైర్యం కలుగుతుంది. గంగూ! ఇయ్యి. (గంగు గ్లాసులోపోసి యిస్తుంది.)

కశో—అక్కర్లేదు. బ్రాందీ యేమీ పనిచెయ్యదు. ప్రయోజనం శూన్యం (అంటూ గ్లాసును చేత్తో తోస్తాడు.)

బళ్ సా—ఓరీ ఉన్మత్తుడా! నీ నీచస్వభావం తెలియక నా యింట్లో చేర్చాను. నీ పశుస్వభావం తెలియక నీ సఖ్యంచేశాను (అంటూ కఠినంగా చూస్తుంటుంది)

ముకు—(ప్రవేశించి) గంగూ (అంటూ గంగు వంక చూస్తాడు.)

గంగు—(ముక్కున వేలుంచుకొని సమయం కాదన్నట్టుగా సైగ చేస్తూ) (O. K.) ఓ. కె. (అంటుంది.)

బక్ సా—(ముకుందునుచూచి) యెప్పు డొచ్చారు? (అంటూ మొగం లో మార్పు చూపుతుంది)

ముకుం—యిప్పుడే వచ్చాను. మళ్లీవొస్తా (అంటూ నిష్క్రమిస్తాడు)

కరో—ముకుంద్. ముకుంద్ (అంటూ లేవపోతాడు)

బక్ సా—నోరు ముయ్యి. అలాకూచో. గంగూ! ముకుందుకు యేమిటి చెప్పావు?

గంగు—సమయం కాదని చెప్పి యెల్లమన్నా నమ్మా.

బక్ సా—మంచిది. ఆ సీసా యిటు తే. (అంటూ గంగు అందీ యగా సీసా తీసికొని) కరోర్! నోరెత్తకండా తాగు. (అని నోట్లో పోస్తూంటే తాగుతూంటాడు తెరపడుతుంది.)

---

# పదునైదవ రంగము

---

న్యాయస్థానము:—జడ్జి, బెంచిక్లార్కు, పబ్లిక్ ప్రాసిక్యూటర్ కోర్టుప్యూన్ ఉంటారు.
బోనులో మోహన్ దాసుంటాడు. ప్రక్కన ఒక కానిస్టేబిల్ ఉంటాడు.

జడ్జి—మోహన్ దాస్! నీమీద మోపబడ్డచౌర్యం విషయంలోనూ హత్య విషయంలోనూ నీవేమైనా చెప్పుకుంటావా?

మోహన్—చెప్పుకు నేందు కేమున్నది?

ప్రాసిక్యూటర్—(Your Honour) యువర్ ఆనర్. వీడుదా నేరం చేశాడు. పూర్తిగా సిక్షించవాల అని నిండా ప్రార్థిస్తుండాను.

జడ్జి—(Yes) యస్ (అంటూజడ్జిమెంటు వ్రాస్తూంటాడు)

అంత సబ్ ఇనస్పెక్టర్, ముకుందు, రాంచందర్ త్వరగా ప్రవేసిస్తారు.
బక్ సారికి కరోర్సుందుకు బేడీలు వేసి కానిస్టేబిల్ తీసుకొస్తాడు.
గంగువెనకాల ప్రవేసిస్తుంది. కానిస్టేబిల్ బక్ సారిపేరు వ్రాసివున్న ఒక పెట్టెతెచ్చిజడ్జికి సమీపంలో వుంచుతాడు.

సబు—(కోర్టుప్యూన్ తో) ఆర్గ్యుమెంట్సు అయాయా?

ప్యూన్—జడ్జిమెంటు వ్రాస్తున్నారు.

ముకుం—(కొంచం ముందుకు బోయి) జడ్జిమెంటు నిలుపు చేయువ వలసిందని నాప్రార్థన.

జడ్జి—కారణం ?

ముకుం—నేరస్థులు వేరు.

జడ్జి—నీ వెవరు ?

ముకుం—(C. I. D. No. 92) సి. ఐ. డి. నంబర్ 92.

జడ్జి—ఏ కేసులో ?

ముకుం—ఈశ్వర్లాలు ఇంట్లో చౌర్యం, ఈశ్వర్లాలు హత్య, మధుర బాల హత్య.

జడ్జి—మధురబాల హత్య (Charge sheet) ఛార్జిషీటు లేదే ?

ముకుం—ఇప్పుడు నేను దాఖల్ చేసుకుంటున్నాను (అంటూ యిస్తాడు.)

జడ్జి—ఈ రెండు హత్యలకు సంబంధమా ?

ముకుం—(Yes your Honour) యస్ యువర్ ఆనర్. ఒక్క రాత్రి, ఒక్క రివాల్వరుతో జరిగినాయి.

జడ్జి—వాటికి కూడా (fresh charge sheet) ఫ్రెష్ ఛార్జిషీటు కావాలి.

ముకుం—అన్నింటికీ కలిపి దాఖల్ చేసుకున్నాను.

(బనారిసీ, కశోర్చంద్‌నీ యింకో బోనులో వుంచుతారు. మోహన్ దాసు తలవొంచుకొని వుంటాడు.)

జడ్జి—(Yes proceed on) యస్ ప్రొసీడ్ ఆన్.

ముకుం—(first witness) ఫస్టు విట్నెస్ రాంఛందర్.

(రాంఛందర్, మోహన్‌దాసున్న బోను పక్క నిల్చుంటాడు.)

(బెంచిక్లార్కు ప్రమాణ వాఙ్మూలము చేయించి)

బెంచి—నీ పేరు?

రాంఛం—రాంఛందర్.

బెంచి—తండ్రి పేరు?

రాంఛం—మూర్జీ.

బెంచి—వయస్సు?

రాంఛం—25 సంవత్సరాలు.

ముకుం—మీరు మధురబాలను ప్రేమించారు.

రాంఛం—అవును.

ముకుం—మధురబాల బర్సారి తోబుట్టువు.

రాంఛం—అవును.

ముకుం—ఆమె కాపురం యెక్కడ?

రాంఛం—బర్సారి యింట్లోనే.

ముకుం—కిశోర్చందుని మీరెరుగుదురా?

రాంఛం—నాకు మిత్రుడుకూడా.

ముకుం—బర్సారికీ కిశోర్చందుకూ స్నేహం.

రాంఛం—ఉంచుకున్నాడు.

ముకుం—ఈశ్వర్లాలుయింట్లో చౌర్యంజరిగిన విషయంమీకు తెలుసా?

రాంఛం—తెలుసు.

ముకుం—యెవరు చెప్పారు?

రాంఛం—కిశోర్చందు బర్సారికి చెపుతుండగా విన్నాను.

ముకుం—ఆరోజు కిశోర్చంద్ బర్సారికి డబ్బేమైనా ఇచ్చాడా?

రాంఛం—నేను చూడటమేకాదు. "మొత్తముమీద మీయుక్క సిద్ధ సంకల్పురాలైంది" అంటూ మధురబాలకు కూడాచూపాను.

ముకుం—బర్సారి డబ్బు తెమ్మని కిశోర్ని బాధిస్తూండేదా?

రాంఛం—యెప్పుడూ బాధిస్తూనే వుండేది.

ముకుం—కిశోర్చందు తాగుబోతు.

రాంఛం—యిద్దరూ పూర్తిగా తాగుతారు.

ముకుం—హత్యావిషయం యేమైనా తెలుసా ?

రాంభ—నాడు నేను గ్రామంలో లేను.

ముకుం— మీరు వెళ్ళవచ్చు. (Second witness) సెకండ్ విట్నెస్ గంగు.

గంగు—(మోహన్ దాస్ బోనుప్రక్క నిలుస్తూ బన్సారివంక చూస్తుంది. బన్సారి చెప్పవొద్దని సైగచేస్తుంది. గంగు చిరునవ్వు నవ్వుతుంది. జడ్జి చూసి తలవూపుతాడు)

బెంచి—(ప్రమాణం చేయించి) నీ పేరు ?

గంగు—గంగు.

బెంచి—భర్త పేరు ?

గంగు—భర్త లేడు.

బెంచి—వయస్సు?

గంగు—15 సంవత్సరాలు.

జడ్జి—(Alright go on) ఆల్ రైట్ గో ఆన్.

ముకుం—నీవు బన్సారి యింట్లో దాశ్యాని వున్నావు కాదూ ?

గంగు—అవును.

ముకుం—ఎంతకాలం నుంచి ?

గంగు—ఆరు మాసాలొద్ది.

ముకుం—యేం చేస్తూంటావు.

గంగు—ఒచ్చేవోరికీ పొయ్యేవోరికీ సారాగళాసు లందియ్యటం.

ముకుం—కిశోర్చందును ఎరుగుదువా ?

గంగు—యెరెక్క మోట వేటండి ? యెప్పుడూ ఆడే పడివుంటాడు.

ముకుం—బాగా తాగుతాడు కాదూ?

గంగు—సీసాలకు సీసాలే.

ముకుం—బన్సారి యింట్లో నీకు సంపూర్ణస్వాతంత్ర్యం వుంది.

గంగు—ఆ,

ముకుం—బకా సారి పెట్టెలో ఈశ్వర్లాలుపేరున్న డబ్బు సంచీచూశావుకాదూ?

బకా సా—గంగూ. (అని గుద్దురుము తుంది)

ముకుం—నోరుముయ్యి. ఇదికోర్టు నీయిల్లుకాదు. గంగూ!

గంగు—సూశాను.

ముకుం—యెప్పుడు చూశావు?

గంగు—తొలీత మీరొచ్చియెల్లినాక. (అనినాలుక కొరుక్కుంటుంది)

ముకుం—భయంలేదు, అంతవరకూ వీలుకాలేదా?

గంగు—ఆయా లే కొత్త సొదట్రంకలిగిందని మీకాయాలే సెప్పాను. కాదూ! మీకాడ యింకో పదిరూపాలు తీసుకొని యిచ్చేతల్కి బాగానమ్మకం కలిగింది.

ముకుం—నీమెళ్లోహారం ఆనాడు బకా సారిపెట్టెలో తీసుకొని......

గంగు—అవును తాళాలిత్తే తీసుకొని యేసుకున్నాను.

ముకుం—ఆరోజు బకా సారి పరిస్థితి యెలావుంది?

గంగు—మీరొచ్చేదాకా యేందో ఆలోసిత్తూ కూకుంది. మీరొచ్చారని నాను సెప్పేతల్కి యేందో "ప్రయత్న భంగమా" అంటూ మీకాడకొచ్చింది. నేనాట్టెసూత్తానేవుండా ఆమె సంగతంతా. అందుకనే "యేందోనని బయమడ్డా" నని మీతోటన్నాను. "ఉద్రేకమైతే సచ్చిమోవాల్చిందే, అదే పాణం తీసుద్దన్నాను" మీరెల్లిపోతూంటే "నిద్దరోతానా" అని నాను సెప్పలేదూ? మీరెల్లిపోయాక, మీరిచ్చిన పది రూపాలూ, ఆమె కిచ్చేతల్కి నన్ను పూర్తిగా నమ్మింది. సాహసంలేంది ఆ యాపారం జరగదంట. రాచ్చంలేంది గడవదంట. యెంతపని సెయ్యానికైనా యెనక్కి తీయకూడదంట. ఇయ్యన్నీ నాకు బోదించింది. యేందేందో అనుకుంది. మా కోపంగా వుండట్టుగా తోసింది.

ముకుం—తరువాత ఆరాత్రి జరిగిన కథంతా చెప్పు.

గంగు—నేనామె మాటలన్నీ యింటూండాను. ఆలోసిత్తుండాను. ఆ రేత్తిరామె బువ్వతిన్నేదు. యేందో జరుగుద్దని అనుమానిత్తూనే వుండా, నాసంగతామె కేంతెలుసుద్ది, దాసీనని నమ్మేసింది.

జడ్జి—అయితే నువ్వెవరు?

ముకుం—(your Honour) యువర్ ఆనర్, ఈమే నా (co-worker) కోవర్కర్. ఈమె అసలు పేరు సరోజ.

నబు—సరోజా (అని ఆశ్చర్యంగా అంటాడు.)

జడ్జి—సరోజా (Very glad) వెరీ గ్లాడ్.

ముకుం—సరోజా నీ వేషంతీసి యిక సరీగా చెప్పు.

సరోజా—(ముక్కుపోగుతీసి కొప్పుతీసి జడవేస్తుంది) తరువాత, నేనో (Corner) కార్నర్‌లో ముసుగుపెట్టుకొని పడుకొని జాగ్రత్తగా (Observe) అబ్జర్వ్ చేస్తున్నాను. పదకొండయింది. బక్‌సారి వరండాలో కొచ్చింది. రివాల్వరు శబ్దమైంది. కొంచం తలయెత్తి చూశాను. బక్‌సారి చేతిలోవున్న రివాల్వరు లోంచి పొగరావడం కనపడ్డది. మధురబాలను (fire) ఫైర్ చేసిందని గ్రహించుకున్నాను. పదకొండున్నరకు కర్పోరేందు ప్రవేశించాడు. ఈశ్వర్లాలు మర్డరు విషయంలో ఇద్దరూ ఓ పావుగంట తర్కించుకున్నారు. మధురబాల (Reveal) రివీల్ చేస్తుందని భయపడ్డాడు కర్పోరేంద్. మధురబాలని మర్డరు చేశానని బక్‌సారి చెప్పింది. కర్పోరేందుకు భయమెక్కువైంది. బక్‌సారి బాగా త్రాగించి ప్రోత్సాహంచేసి రివాల్వరిచ్చి పంపింది. యీ పరిస్థితికి నాకు భయమేసింది. కాని ధైర్యంచేసి వున్నాను సుమారు రెండు గంటలకు కర్పోరేందు మళ్ళీ బక్‌సారి యింటికి వొచ్చి, (Murder) మర్డరు చేశాననీ (Police enquiry) పోలీస్ ఎంక్వైరీ అయిందని చెప్పాడు.

జడ్జి—యికచాలు. నీ ధైర్యానికి మెచ్చుకున్నాను.

ముకుం—(బక్‌సారితో) పెట్టె తాళంచెవి?

బక్సా—లేదు.

ముకుం—192! బొడ్లో తాళాలుంటాయిచూడు. (కానిస్టేబుల్ తీసి యిస్తాడు)

ముకుం—(జడ్జియెదురుగా పెట్టితీసి సంచి, రివాల్వరు, నల్లముసుకుతీసి) (Your honour P. W. one and two) యువర్ ఆనర్ పి. డబ్లియు. వన్ అండు టు చెప్పిన ప్రకారం (theft) థెఫ్టు కు సంబంధించిన సంచియిది. దీనిమీద ఈశ్వర్ అనిపేరున్నది. చౌర్యానికి కారణం, (Money) మనీ లేకుండా కర్పూరప్పందుని బక్సారి చెంతచేరనివ్వక పోవడమే. (P. W. two) పి. డబ్లియు. టూ. చెప్పిన ప్రకారం రెండు హత్యలూ యీరి వాల్వరుతో జరిగినై. ఇందులో మూడుతోటాలు (Load) లోడ్ చేయబడివున్నాయి. అందులో రెండుతోటాలు (fire) ఫైర్ చేయబడ్డాయి. హత్యాసమయంలోయెవరూగుర్తించకుండా కర్పూరప్పందు యీముసుకు తలకు తగిలించుకున్నాడు. (అని సంచి రివాల్వరు, ముసుకుగుడ్డ జడ్జిముందుపెట్టి) (Cause of murders) కాజ్ ఆఫ్ మర్డర్సు ఈశ్వర్లాల్ ప్రవర్తి అంతానం గ్రహించాలని బక్సారి ముఖ్యోద్దేశం. అందుకు ఇంతకన్న మార్గంకనుపించలేదు. ఈరహస్యం మధురబాల గ్రహించడం వల్ల (Reveal) రెవీల్ చేస్తే, తనప్రయత్నానికి భంగం కలుగుతుందని తన (Sister) సిస్టర్ని బక్సారిస్వయంగా (Murder) మర్డరు చేసి కర్పూరప్పందును తాగించి ప్రోత్సాహం చేసి రివాల్వరిచ్చి కర్పూరప్పందును పంపింది. కర్పూరప్పంద్ ఆరాత్రియే తిరిగి బక్సారి దగ్గరకు వచ్చి ఈశ్వర్లాల్ని హత్యచేశానని చెప్పినట్లు (P. W. two) పి. డబ్లియు. టు. (Prove) ప్రూవ్ చేసింది. గనుక యీకేసులలో (real culprits) రియల్ కల్ప్రిట్సు బక్సారి, కర్పూరప్పందు లనడానికి సందేహంలేదు. (So I request the Court to release innocent Mohandas and to punish the real culprits) సో

ఐ రెక్వెష్టు ది కోర్టు టు రిలీజ్ ఇన్నోసెంట్ మోహన్ దాస్ అండ్ టు పనిష్ ది రియల్ కల్ప్రిట్స్.

జడ్జి—బన్ సారీ ఈవిషయంలో నీవేమైనా చెప్పేటుందువా?

బన్ సా—ఇదంతా అబద్ధం.

జడ్జి—కరోర్చంద్ నీవు ?

కరో—మీకు తెలిసినవరకూ తెలిసింది. ఇక నన్నడగొద్దు.

జడ్జి—మోహన్ దాస్ నీవు నిర్దోషివి. నిన్ను (Release) రిలీజ్ చేశాను. (అంటూ జడ్జిమెంటు వ్రాస్తూంటాడు. మోహన్ దాస్ సంకెళ్ళూడదీస్తారు. మోహన్ దాస్ స్మితవదనంతో సరోజా చెంతకు పోతాడు. ముకుందు చిరునవ్వు సూచిస్తాడు)

మోహన్—చెల్లీ ! నాకోసం త్యాగం చేశావు.........

సరోజ—(Brother) బ్రదర్ నేనేం చేశాను? అదిగో ఆ దివ్యమూర్తి (అంటూ ముకుందుని చూపిస్తుంది)

మోహన్—(ముకుందువంక పోతూ) అయ్యా, నా నిర్దోషిత్వాన్ని (Prove) ప్రూవ్ చేశావు. నన్ను రక్షించావు. (My angle) మై ఏంజల్ (అంటూ కౌగలించుకో పోతాడు)

ముకుం—(తీవ్రంగా చూస్తూ ఆగు అని చెయ్యి అడ్డుపెడతాడు)

(మోహన్ సభ్యుడై సరోజవంక చూస్తాడు. సరోజ చిరునవ్వు సూచిస్తుంది. ముకుందు కోటుగుండీలు ఊడదీసుకుంటుండగా ముకుందు వంక చూస్తాడు)

ముకుం—(చిరునవ్వుతో) మోహన్ (అంటూ తలగుడ్డతీసి కోటు వూడదీస్తాడు)

మోహన్—(ఆశ్చర్యంతో) కిషోరీ !

జడ్జి—కిషోరి (Admirable) ఎడ్మిరబుల్ (ఆశ్చర్యం సూచిస్తూ రాస్తూంటాడు)

సభ—(ఆశ్చర్యంతో) (Wonder) వండర్ కిషోరి.

(బన్ సారి కరోర్చందులు హాఁ అని ఆశ్చర్యంగా చూస్తారు)

మోహన్—ఆహా నా భాగ్యదేవత.

రాంభం—కృతప్రతిజ్ఞురాలైంది.

జడ్జి—(జడ్జిమెంటు వ్రాసి కలం విరగకొట్టి లేచిపోతాడు)

బెంచి—(జడ్జిమెంటు చదువుతూ) మధురబాలను హత్య చెయ్యడమే కాకుండా ఈశ్వర్లాలు హత్యకుకూడా కారణభూతురాలైన బన్సారికి ఉరిశిక్ష. అంధుడై, బన్సారి వలలోజిక్కి తాగుబోతై, చోరుడై, ఈశ్వర్లాలును హత్యచేసి నందుకు కశోర్చందుకు తాగుబోతు, చోరుడు, హంతకుడు అనే పేర్లతో ప్రపంచంచేత నిరసింపబడుతూ జీవించి యుండటమే శిక్ష. (బన్సారిని పోలీసులు తీసుకుపోతారు)

కశోర్—దుర్భర జీవితం (అంటూ నిష్క్రమిస్తాడు)

(సబు ఇనస్పెక్టరు, రాంఛందర్, మోహన్దాస్, కిషోరి, సరోజ్ ముందుకురాగా వెనక తెర బడుతుంది.)

కిషో—సరోజా! నీవు నా (Own sister) ఓన్ సిష్టర్వి. నా (Property) ప్రాపర్టీలో సగం నీది.

రాంఛం—చంద్రన్! సోదరి సరోజాని.........

చంద్రన్—అవశ్యం నా భాగ్య లక్ష్మి సరోజా! (రాంఛందర్ యిద్దరి చేతులూ కలుపుతాడు)

రాంఛం—కిషోరీ......... (కిషోరి సిగ్గు అభినయిస్తుంది)

(రాంఛందర్ మయానికి ప్రవేశించి మోహన్దాస్, కిషోరుల చేతులు కలుపుతాడు)

రాంఛం—ప్రేమజ్యోతి వెలుగుతోంది. అదిగో! తారాగణంలోంచి నా మధురబాల ప్రసన్న వదనంతో తొంగి చూస్తోంది. ధర్మమే జయం. (అంటూ నిష్క్రమిస్తాడు)

మోహన్—కిషోరీ.
కిషోరి—మోహన్.
చంద్రన్—సరోజా.
సరోజ—చంద్రన్.
} (అంటూ ప్రేమదృక్కులను ప్రసరింప జేసుకుంటారు

(తెర పడుతుంది)

అయిపోయింది.

---

# రంగూన్ మెయిల్.

రచయిత: సూరి పార్థసారధి శర్మ గారు.

ఇయ్యది రంగూన్ రౌడీ అనంతర కథ. మిత్ర వంచకుల యుక్తి ప్రయుక్తులు, విటకత్తియల మోసకృత్యములు, చెడిపెల సాహస కృత్యములు, త్రాగుబోతుల దుర్గతులు, విటగాండ్ర అధఃపతనములు, చక్కగ చిత్రింపబడినవి. రంగూన్ మెయిల్ కొట్టుకొనిపోయిన భీభత్సముతో కథ ప్రారంభమై సర్వజనానందముగ రంగూన్ మెయిల్ విశేషలాభ మార్జించుకొని సురక్షితముగ కాకినాడ రేవుచేరిన సంతోష ఘట్టముతో నీనాటకమున భరతవాక్యము చెప్పబడినది. ఇంతటి సంతోషమునకు కారణము, శంకరరావు కుమారుడగు మోహన్ రావు యదృష్టమా? అతని భార్యయగు సుశీల పాతివ్రత్యమా? వీరి నోముల పంటయైన శ్యామసుందరుని యదృష్టమా? యనునది ప్రశ్న. ఈ ప్రశ్న సుశీల తండ్రియైన కృష్ణమూర్తిచేత పరిష్కరింపబడినది. మోహనరావును సర్వనాశన మొనర్చిన వెంకట్రావు, అతని మిత్రుడగు రాజారాం లొనర్చు దుండగములకు నాటకాంతము వరకు నంతముండదు. తన పుత్రుని తాను చంపుకొనెనను నేరముతో మోహన్ రావున కురిశిక్ష విధింపబడనున్న సమయమున భయానక రూపముతో వెంకట్రావు భార్యయగు శాంత న్యాయస్థానమున కరుదెంచి మోహనరావుకు కలుగనున్న శిక్ష తప్పించినది. ఇందుకు కారణ మామె యాతని ప్రేమించి యుంటయే? మల్లీమొంకల హాస్యము, హాస్యములో ప్రేమ, ప్రేమలో శృంగారము, అందులో అన్యక్తము, రంగరంగ మధ్యమున కడుపుబ్బ నవ్వుపుట్టించుచుండును. ప్రతి ఘటన [illegible]దును నవరసములు తొలుకాడుచుండును. నవయుగమునకు కొ [illegible] [illegible]ముదా[illegible]లుకు పాటలుకూడ గలవు! వెల 1-0-0.

---

దొరకువారు :—

సంపర మల్లిఖార్జున్ ను నెహ్రూ బుక్ డిపో, బెజవాడ.